# సిందూరం

వచనకవితా సంకలనం



ప్రచురణ




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# SINDURAM

An Anthology of Free Verse

By AJANTHA, ARUDRA, KALOJI, KUNDURTI, DEVARAKONDA BALAGANGADHARA TILAK, DASARATHI, Dr. C. NARAYANA REDDY, PATHABHI, BOYE BHIMANNA, BAIRAGI, SRIRANGAM NARAYANA BABU, SISTLA UMA MAHESWARA RAO, SRI SRI, SOMA SUNDAR.



యువభారతి

ప్రచురణ : 27
ప్రథమ ముద్రణ : 3,200
1 డిశంబర్, 1974

ముఖపత్రరచన ; అక్షరాలంకరణ :
శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్సు, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
విస్టాన్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500003.
లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500001.

వెల : రూ. 2-00 లు

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL



# మా మాట

ప్రాచీన అర్వాచీన సాహిత్యాలతో దిఙ్మాత్రంగానైనా పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో యువభారతి అనేక కార్యక్రమాలను, నిర్వహించి పుస్తకాలను ప్రచురించింది.

కాలానుగుణంగా సమాజంలో అభిరుచులు మారుతుంటాయి. అధ్యయన విధానంలో మార్పులొస్తుంటాయి. పరిశీలనా దృక్కోణాలలో వైవిధ్య మేర్పడుతుంది. రచనా విన్యాసాలలో కొత్త అందాలు గుబాళిస్తాయి.

పానీయానికున్న ప్రాముఖ్యం పాత్రకుండదు. పానీయం ఆస్వాదనీయమైనప్పుడు పాత్ర పుత్తడి దైతేనేమి? ఇత్తడిదైతేనేమి? గణ రహితమైన వచనం ఎంత అందమైనదీ, గణబద్ధమైన పద్యం కూడ అంతే అందమైనది. తీవకున్న పూల అందం వేరు, మాలలో ఉన్న పూల అందం వేరు. కోకిలారావం మధురమైనదే, వీణారావం మధురమైనది. అయితే ఒకటి సిద్ధం, మరొకటి సాధ్యం.

గణ, యతి, ప్రాస లనే ఛందోబంధాలనుండి విడివడి స్వచ్ఛందమైన భావాలను కవితగా ప్రచురించిన పదునాలుగురు కవుల కవితల సంకలనాన్ని 'సిందూరం' గా ప్రచురిస్తున్నాం. ఇందుకు తమ అంగీకారాన్ని తెలిపిన మహాకవులకు మా కృతజ్ఞతాభివందనములు. ఈ సంకలనం లోని కవుల క్రమం వారిపేర్లలోని అక్షరక్రమం.

"కవితపేరు ముందుచూపు" అని ఈ కవితాసంపుటికి సిందూర తిలకం దిద్దిన డాక్టర్ ఆరిపిరాల విశ్వం గారు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన విద్వత్కవులు. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల, హిందీ భాషలలో చక్కని, చిక్కని అభినివేశం కలవారు. పలువురు ఆధునిక తెలుగు కవుల కవితలను ఇంగ్లీషులోనికి అనువదించి ప్రపంచానికి పరిచయం చేసిన విశాల హృదయులు. డాక్టర్ విశ్వంగారికి యువభారతి సమాదరంతో కృతజ్ఞతాభివందనాలు సమర్పించుకుంటున్నది. ఈ సంకలన సంపాదనలోనూ, ప్రచురణలోనూ తమ హార్దిక సహకారాన్నందించిన మా సహసమావేశ కర్త డాక్టర్ నాగినేని భాస్కరరావును అభినందిస్తున్నాము.

యువభారతి సాహిత్య కార్యక్రమాలు కొత్తపాతల మేలు కలయికలు. ఈ సిందూరం దీనికి నిదర్శనం. తెలుగు పఠితృలోకం మా యీ ప్రయత్నాన్ని హర్షించి ప్రోత్సహిస్తుందని ఆశిస్తున్నాము—

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు

1-12-1974



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 32 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే - యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 7,500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. ఈరోజు నుండి ఈ ప్రణాళిక కొత్తరూపు దాలుస్తున్నది. ఇందులో కూడా సహృదయులు చేరి తమ సహాయ సహకారాలు అందజేస్తారని ఆశిస్తాము. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 450 మంది, భారతీ భూషణులుగా 50 మంది చేరారు.

ఉదుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం-ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తూ—

1-12-1974

అధ్యక్షుడు

# కవిత పేరు ముందుచూపు

## —డా॥ ఆరిపిరాల విశ్వం

ప్రతిభాత్మ చేసే కాంతిపరిస్పందం, రూపవిలసితం అయితే వస్తుధ్వని. సౌందర్య నిష్ఠంగా భాసిస్తే అలంకారధ్వని. స్వానుభూత్యేకరూపమైతే రసధ్వని. పూర్వాలంకారికుల్లో కొందరు శబ్దంయొక్క రూపసౌందర్యంపైన మక్కువచూపినా ఎక్కువమంది అనుభూతివాదులే.

అచ్చమైన కవిత అనుభూతికి మాత్రమే ప్రాధాన్యమిస్తుంది. అనుభూతి ఆంతరిక సంచలనం. అంటే లోపలి ఆత్మలోతుల్లోకి యాత్రచేయటం. ఒకరకంగా కవితకు సంచలనం ఆత్మ. అరూపంగా ఉన్నప్పుడు పూర్వులు దీన్ని ఆకూతి, ఆర్తి అన్నారు. రూపం యివ్వగలిగితే అనుభూతి.

నీవు- నీవుకావని చెబితే కవిత.
రూపసౌందర్యంకన్న- అనుభూతి సౌందర్యంపైన జీవిస్తుంది కవిత.

వచనకవితం పుట్టింది ఈ పరాస్థితియొక్క పరిణామపేశల రమణీయతకే. అదొక ఆలోచనా సంచలనం. అనుభూతి ప్రయత్నం. చేసే ప్రయోగాలెన్నో భగ్నమైతేనే కాని, ఉద్విగ్నఆర్తికి- అనుభూతిసౌందర్యస్థితి దొరకదు. ఇది కవితా ప్రస్థానం.

ఎప్పటికప్పుడు మొదలేకాని చివరంటూ లేని సృష్టికవిత. అంచేత- యుగపరిధులదృష్ట్యా-తాత్వికావసరాలదృష్ట్యా - రేపు మరోక్రొత్త- ప్రయోగం పుట్టితీరుతుంది. నిన్నటి సర్వప్రయత్నాలూ పాతలో కలిసిపోతాయి. అలాగే వచన కవితకూడా.

ఇది వచనకవితాయుగం.
వచనకవిత ఏమిటి? వచనపద్యం, వచనగేయం, స్వచ్ఛందకవిత,

ముక్తచ్ఛందం, నిర్ముక్తకవిత అనికూడా అంటున్నారు. మొత్తంమీద వచనకవిత అన్నపేరు నిలిచిపోయింది విస్తృతంగా. వచనానికి-వచనకవితకీ భేదం-కవితయొక్క ఆభావంలోను- భావంలోను ఉన్న రహస్యమే. అలాగే గేయంలో గానలక్షణంతోపాటు,

కవిత ఉండాలి. పద్యంలో - గణ,యతి,ప్రాస నియమాల వెనక కవిత ఉండాలి. బాహిరమైన నియమంలేకుండా, వచనంలా భాసించే మాటల్లో-సౌందర్యాన్ని బంధించే ప్రయత్నం వచన కవిత. పద్యంరాసి గెలిచామనిపించుకొన్నవాళ్ళ సంఖ్యతో పోలిస్తే -వచన కవితరాసి గెలిచామనిపించుకునే వాళ్ళసంఖ్య బహుతక్కువ. పద్యరచయితలకి-తత్పూర్వశాస్త్రవేత్తలు-పథనిర్దేశం చేసిపెట్టారు. వచనకవితా ప్రక్రియలో ఎప్పటికప్పుడు కవి తన పథనిర్దేశాన్ని తానే చేసుకోవాలి. అందుకే వచనకవిత రాసి మెప్పించడం కష్టం. అనిర్వచనీయానుభూతిని- భావపంజరంలో బంధించాలంటే ఎప్పటికప్పుడు నిర్వచన కుతూహలంకంటె సౌందర్య దిదృక్ష పెరగాలి.

వస్తు, అలంకార, రసధ్వనుల్లో- రసధ్వనియే పరమోత్తమమని జగన్నాథుని తీర్పు. ఆధునికులు రసానికి ఉపాధియైన భావన (mood) వరకు కవితాప్రస్థానాన్ని తీసుకుపోయారు. భావనని- సౌందర్యంలో బంధించాలంటే భావశిల్పం (Imagery) అవసరం అయింది. భావశిల్పపు జనిస్థానం భావచిత్రం. అంటే Image.

నేటికవితకి భావచిత్రం ప్రధానం. రసంకాదు. అంటే రసానికి-దాని ప్రపంచీకరణకి విస్తృతమైన ఇతివృత్త అవసరంవుంది. ఇది చిత్రకారుని చిత్రఫలకం (canvas) లాంటిది. భావచిత్రం (Image) కవితా ప్రస్థానం నేటికవుల ప్రధాన శిల్పలక్షణం. భావచిత్రానికి పూర్వావస్థలు- భావచిహ్నం (sign) భావముద్రిక (symbol); మధ్యావస్థలు ఊహ (Fany) భావన (Imagination) పరాస్థితి - భావచిత్రం (Image).

భావచిత్రం-కాలంపైన-దేశంపైన-అనుభూతిపైన నిర్మితమౌతుంది. కాలంపైన అంటే- రూపసమన్వయంకోసం- Myth గా రూపొందొచ్చు. కాలంయొక్క నిరవధికస్థితిని- చూపటం కవిత. ఆధునికులు దీనికోసం భావచిత్రాన్ని రూపొందించారు. వచనకవిత రసంపైకంటె, భావచిత్రబలంపైన శిల్పాన్ని రూపొందిస్తుంది. వచనకవితలో భావచిత్రం నిర్దిష్టసౌందర్యోత్పాదక ప్రధానకేంద్రం. ఉపభావచిత్రాలు (Subsidiary Images) కవితలో ఉండొచ్చు. వీటి కదలికవల్ల భావలయఉత్పాద్యం అవుతుంది. భావలయ అర్థాన్ని, అర్థాంతరాన్ని సమానవివక్షతో పర్యాప్తం చేస్తుంది. పూర్వుల ధ్వనిసిద్ధాంతంకంటె యిది భిన్నం. ధ్వనిలో ప్రకరణార్థం-ఉపసర్జనీకృతం అవుతుంది ఇక్కడకాదు.

ఉపభావచిత్రాలు- ప్రధానభావచిత్రానికి ఉపాంగాలు.రసపోషణం పూర్వులపద్ధతి భావచిత్రశిల్పం నేటి పద్ధతి.

వచనాన్ని విరిస్తే - వచనకవిత అనుకునేవాళ్ళు లేకపోలేదు. వాళ్ళు వచనాన్ని, కవితనీ చెడగొట్టినంత మరెవ్వరూ చెడగొట్టలేరు.

పద్యంరాసి మెప్పించటం తేలిక. వాళ్ళకి పూర్వచరిత్రబలం ఉందికనక. క్రొత్త చరిత్రని సృష్టించేవాళ్ళకి యీ సదుపాయంలేదు. అంటే వచనకవితకు యిలాంటి సహజ సౌకర్యంలేదు.

సంప్రదాయం బ్రతికేది నవప్రయోగబలంపైన. నవప్రయోగం ఓరకంగా సంప్రదాయాన్ని ఛేదిస్తుంది అంటే దానికి శస్త్రచికిత్స చేస్తుంది. అయితే యీ నవ ప్రయోగవాదుల్లో విద్రోహులు (Rebels), తిరుగుబాటుదారులు (Revolutionaries) పరిణామవాదులూ ఉంటారు. కూకటివేళ్ళతో గతాన్ని పెకలించాల్సిన అవసరందగ్గరే- ఆగిపోతారు కొందరు. దాన్ని పెకలిస్తారు మరికొందరు. తర్వాత ఏదోచేయాలి ; అదేదోచేసేశక్తి వాళ్ళకిపోతుంది అప్పటికే. ఒక్క పరిణామవాదులైన ప్రయోగవేత్తలే సాహిత్యాన్ని ముందుకు తీసుకుపోగలరు.

వచనకవిత- గతంలోని సర్వసౌందర్యాన్ని స్వీకరించుతుంది. భవిష్యత్తులో రూపొందించుకోగల సౌందర్య అవకాశాలను వినియోగించుకొంటుంది. అందుచేత వచనకవిత సమన్వయ సౌమనస్య స్ఫూర్తిపై జీవిస్తుంది. కమిట్‌మెంటు ఏదైనా- జీవనదర్శనం చేయాలి. అంచేత 'ఇజాల్లో'ను వాటి వెలుపల ఇది రాణిస్తుంది. చరిత్ర చెప్పిన రహస్యాలని అవగతం చేసుకొంటుంది. నిరంతరాన్వేషణలా సౌందర్య సుమా లను పూయిస్తుంది. కవిత వాదంలోంచి పుట్టదు. అదిపుట్టేది నిర్వేదంలోంచి. వచన కవిత యిందుకు భిన్నంకాబోదు.

వచనకవిత రాశిలోపెరిగిందేకాని గుణం తక్కువ అని కొందరి వాదన. ప్రతిభ ఎప్పుడైనా ఎక్కడైనా రాశిలో పెరగదు. గుణంలోనే. పద్యకవితమాత్రం ఎంత ఆశాజనకంగా ఉందో చెప్పండి ? ఇక్కడ ప్రతిభను గుర్తుపట్టటోయి దాని అభావాన్ని చూడటంచేత వచ్చే ఆభాసచైతన్యంవల్ల కలిగే భ్రమ. అంతే. కవికావటానికి ప్రతిభ ఉండాలి. దర్శనఉండాలి. స్పందనఉండాలి. సౌందర్యభావన ఉండాలి. అన్నిం టినీ మించి- ఆర్తిఉండాలి. అదిలేని కవిత-కవిత-అంతే- వచనకవిత అయినా మరే కవిత అయినా.

కవితకి రెండుకళ్ళు ఆలోచన-అనుభూతి. అవిలేందే కాగితాలు నింపటంతప్ప మరేమీ జరగదు. చదవాలి-జీవితాన్ని. ఆలోచించాలి అనుభూతిని- ప్రతిభాస్పందంతో- అప్పుడు అవుతుంది కవిత- ఒక సౌందర్యస్యందనం- అనుభూతిసౌధం-జీవనదర్శనం-

అనుభూతిని విమర్శించుకొనే - నేను - సిద్ధాంతాలతో కాలక్షేపన చేయలేను. ఇంకా నేననుకొనే అచ్చమైన అనుభూతి కవిత ఎలా ఉండాలో యీ పంక్తుల్లో చేసు కొన్న ఆత్మమథనం దర్శించండి.

# కవిత

కవిత-
కాలానికి ముందుమాట
లోకం దాని గీటురాయి
అనుభూతి ఆత్మ.
ఆత్మలోతుల ఆఖరి వెలుగు కవిత
నిర్వచనం నింపలేని నిశ్శబ్దం కవిత
స్పందన దాని గమనం
సౌందర్యం గమ్యం
అద్వైతం అవధి.
వాక్కు వెంట అర్థంలా
అర్థంవెనక అనుభూతిలా
అనుభూతి కావల అద్వైతంలా
నవతనేర్చిన నర్తనంలా
చైతన్యం చేర్చిన చివురు కొమ్మలా
చివరికి మిగిలే చేతకాని తనంలా
వేదన వేసిన వేయిరేకల పద్మంలా
విశ్వతో ముఖమైన కవితకి
రూపమెక్కడ ? నిర్వచన మెక్కడ ?
గాలినీ, జాలినీ, వెలుగునీ, వెన్నెలనీ
దేవుణ్ణీ, జీవితాన్నీ
ఇంకా మరెన్నిటినో
విప్పిచెప్పలేని మన అజ్ఞానం
కవితమీదికి కాలు దూస్తుందెందుకు ?

అనుభూతి తర్కాతీతం
అనుభూతికి మరోవెనక మూగ అనుభవం
ఇన్ని తెరలవెనక-
కన్నిటి పొరలవెనక
రూపంలేని దీపం కవిత.
సృష్టి విప్పలేని సౌందర్యం కవిత
కాలం అంటని కదలే కారుణ్యం కవిత
నేటి యాతన ఒడ్డున చివరిఆశ కవిత
రేపటి ఆమని కవిత.

కవిత వట్టి వాగ్దానం కాదు
క్షణాల తరంగాలపై తేలే విప్లవ విహంగం
జీవితం నిర్వచనాల కందదు
కవిత అంతకన్నా.
కవిత కానిదేదో కసిగా చెప్పేయొచ్చు.
ఇక —
కవిత ఏదో చెప్పమంటే
చెప్పటానికి చేతకాని మూగితనం అంటాం
శబ్దం చూపుడువేలు
అనుభూతి చంద్రుణ్ణి చూపిస్తే
మూర్ఖులు వేలినే చూస్తారు
రసరాట్టులు రాకాశశిని అవలోకిస్తారు

అజ్ఞానానికి మరోపేరు దృష్టిభేదం
భేదంలేని దృష్టి కవితాసృష్టి
అన్నీ తెలుసనుకున్న తర్వాత-
మిగిలే అనుభూతి సౌందర్యం కవిత.
కవిత ఒక ఆరాధనా విశేషం

దానికి పూర్వా నవ్యభేదాల్లేవు
కవిత నీ కిచ్చే అద్వైత సిద్ధిని
సిద్ధాంతాల, రాద్ధాంతాలతో
చిందరవందర చేయకు.
శాస్త్రాలు సౌందర్యాన్ని శాసించలేవు
కన్నీళ్ళు కార్చలేని కళ్ళు
అందాన్ని చూడలేవు
కవితాస్పందాన్ని అంతకన్నా
దర్శించలేవు
సౌందర్యం రూపం కాదు తత్త్వం.
కవిత దాని పరాకాష్ఠ.

జీవితపు ఎడారిలో
ఎక్కడో కనిపించే ఒయాసిస్సు కవిత
మిగిలిందంతా ఎండమావి
భ్రమల్ని కల్పించే శబ్దాంబరాల వెనక
ప్రమలా వెలిగే ఆనందచేతన కవిత.
శబ్దమే కవిత కానప్పుడు
ఛందస్సు కవిత ఏమిటి ?
ఆత్మలోతుల సౌందర్యాలయని మధిస్తే
అవి కవిత కుపాంగాలు
అగుపించని అనుభూతిని
ఆవిష్కరించుకునేందుకు
పడ్డ అగచాట్లు శాస్త్రాలు.
శాస్త్రానికి ముందూ వెనకా
మిగిలేది జీవితం
అనుభూతి నందించలేని అలంకారం
అర్థంకాని శబ్దంలాంటిది
ప్రయోగం తప్ప ప్రయోజనమెరుగనిది.
ఛందస్సంతా కవిత అయితే
అష్టవిధ కవితలెందుకు ?
తరగతి భేదాలెందుకు ?
మాటలపోగే కవిత అయితే
పలకగల ప్రతిపక్షీ-కవి అవుతుంది.

మాటల మందారాల గుండెల్లో
పొంగే తీయదనం కవిత
రేపటి వాకిలి తలుపుని
ఓరగా తెరిచే ఓరగాలి కవిత
నిదురించే కల్హారపు నిస్తులాంతరంగంలో
చిక్కువడ్డ భ్రామరీరుతి కవిత
జీవుని వేదన కవిత
నేటి విప్లవం కవిత
రేపటివేదం కవిత;
గుండెమీటే కొత్తవూపిరి కవిత
నీ వెవ్వరో అర్థంకాని నీ ముందు
వెలుగు గీతల్లో
వేసే నీ బొమ్మ కవిత.
అనుభూతి నించి-అనుభూతికి
ప్రశ్ననించి ప్రశ్నకీ ప్రయాణం కవిత.
మార్పునించి మార్పుకి
మరోయాత్ర కవిత.
ముందుచూపు లేకపోవటానికీ
అసలు చూపు లోపించటానికీ
పెద్ద తేడా లేదు
అందుకే కవితపేరు ముందుచూపు
నిన్నటి అర్థాన్ని, నేటి పౌరుషాన్నీ
అమృత భవిష్యత్‌గా మార్చటం కవిత
జ్ఞాపకాల వరండాల మెట్లముందు
ఉదయంకోసం నిరీక్షిస్తూ

ఒకలా తలవంచిన గులాబి కవిత.
శబ్దానికి ముందు-
నిశ్శబ్దానికి వెనక
సుప్తరాగిణుల పదమంజీరాల
అలరింపులో
మేల్కొన్న ఆనంద వేదన కవిత
జీవించటం కన్న జీవితానికి
నిర్వచనం అయ్యున్న
అనుభూతి కవితాత్మ అయినప్పుడు
దానికి మరోపేరు మానవత ; రమ్యత
వెలుగు దారెంట వెళ్ళాల్సిన దివ్యత
అందుకే కాలావధుల్ని వెలిగించే
కొత్త ఉషస్సు కవిత.
అనుభూతి వచస్సు కవిత,

పాతయుగానికి భరతవాక్యం కవిత
నవయుగానికి నాంది అవుతుంది కవిత
అప్పుడే రక్తాణువుల్లో కోటికోట్ల
సూర్యుల్ని ఉదయిస్తుంది కవిత
చీకటిని ఉరితీస్తుంది కవిత.



# ఋక్కులు

కుక్కపిల్లా,
అగ్గిపుల్లా,
సబ్బుబిళ్ళా—

హీనంగా చూడకు దేన్నీ !
కవితామయమేనోయ్ అన్నీ !

రొట్టెముక్కా,
అరటితొక్కా,
బల్లచెక్కా—

నీవేపే చూస్తూ ఉంటాయ్ !
తమలోతు కనుక్కోమంటాయ్ !

తలుపుగొళ్ళెం
హారతిపళ్ళెం
గుర్రపుకళ్ళెం—

కాదేదీ కవితకనర్హం !
ఔనౌను శిల్పమనర్ఘం !

ఉండాలోయ్ కవితావేశం !
కానీవోయ్ రసనిర్దేశం !
దొరకదటోయ్ శోభాలేశం ?

కళ్ళంటూ ఉంటే చూసి,
వాక్కుంటే వ్రాసీ !

ప్రపంచమొక పద్మవ్యూహం !
కవిత్వమొక తీరని దాహం !

—శ్రీశ్రీ

సిందూరం

# అనుక్రమణిక


| | | |
|---|---|---|
| మామాట | ... | 3 |
| యువభారతి పరిచయం | ... | 4 |
| కవిత పేరు ముందుచూపు<br>—డా॥ అరిపిరాల విశ్వం | ... | 5 |
| అజంతా | ... | 13 |
| ఆరుద్ర | ... | 17 |
| కాళోజీ | ... | 21 |
| కుందుర్తి | ... | 25 |
| దేవరకొండ బాలగంగాధర తిలక్ | ... | 29 |
| దాశరథి | ... | 33 |
| డా॥ సి. నారాయణరెడ్డి | ... | 37 |
| పఠాభి | ... | 41 |
| బోయి భీమన్న | ... | 45 |
| బైరాగి | ... | 49 |
| శ్రీరంగం నారాయణబాబు | ... | 53 |
| శ్రీశ్రీ | ... | 57 |
| శిష్ట్లా ఉమామహేశ్వరరావు | ... | 61 |
| సోమసుందర్ | ... | 65 |

# అజంతా

## చెట్లు కూలుతున్న దృశ్యం

ఆశలేదు ఆస్కారంలేదు
ఫలానారోజు శాపం ఆఖరౌతుందనే హామీ లేదు
ఫలానా రోడ్డు గమ్యం జేరుస్తుందనే సూచన ఎక్కడా ఏమీలేదు
జీవితం ఎప్పుడూ ఇలా కన్నీళ్ళ ప్రవాహంగానే సాగుతుందనుకుంటాను
రోడ్డు పొడుగునా చెట్లు కూలుతున్న దృశ్యాలనే చూపుతుందనుకుంటాను

ఐతే ఇప్పుడు అక్షరాలా నిజం
మిత్రుడు వెంకట్రావు జీవితంలో చెట్లు కూలుతున్నమాట నిజం
లేకుంటే ఎంతో అందమైన సాయంత్రం కదా ఇలా అపస్వరాలు వినపడటం జరగదు
రోడ్లమీద ధూళి దారిద్ర్యం సమస్తం
వెంకట్రావు ముఖంమీదనే 'ఓచ్చాదుతూ' ఉండటం సంభవం కాదు
అసలు వెంకట్రావు ముఖం గాలీ వెల్తురూ లేని గదిలాగ
మరీ ఇంత దీనంగా ఎన్నడూ ఉండనే ఉండదు

ఐతే ఇప్పుడు నిర్ధారణగా చెప్పకోవచ్చు
మిత్రుడు వెంకట్రావు ప్రస్తుతం నిరుద్యోగి అని మరీ మరీ రూఢిగా చెప్పకోవచ్చు
అంతేకాదు ప్రస్తుతం మిత్రుడు వెంకట్రావు కాలం అనే గరుడపక్షి
ఎక్కడ యే ముళ్ళచెట్లమీద విహారం చేస్తూవుందో కూడా ఊహ చేసుకోవచ్చు
హృదయవిదారకమైన ఒకానొక దృశ్యం కళ్ళారా చూడవచ్చు
తలక్రిందులైన స్వప్నంమీద శల్యాకారంగా కూర్చున్న కుర్రవాడు
ఆపాదమస్తకం సూదులతో ముస్తాబై ఉన్నవాడు
అతని ముఖం నిండా స్ఫోటకం మచ్చలు
కళ్ళలో శిలావిగ్రహాల వీక్షణలు
అతనిచుట్టూ పరాజయభారంతో కృంగుతూ ఉన్న వృక్షాలు

ఇదే దృశ్యం ఇంకా భారీఎత్తున భూతద్దాలతో చూడవచ్చు
మిత్రుడు వెంకట్రావు ప్రస్తుతం
ఎక్కడ ఏ వేళ ఏంచేస్తూఉంటాడో కూడా మనం ఊహ చేసుకోవచ్చు
నిరుద్యోగి వెంకట్రావు నిత్యం ఆకాశం కిందనే ప్రస్తుతం నివాసం చేస్తూ ఉంటాడు
రెండుకాళ్ళ వాహనంమీదనే నగరసంచారం చేస్తూఉంటాడు
అడుగడుగునా తన జీవితం పేకమేడలై కూలుతున్న దృశ్యాన్ని చూస్తూ
నగరం అంతటా అపస్వరంలా వ్యాప్తమౌతూ ఉంటాడు

నిరుద్యోగి వెంకట్రావు రోడ్లమీద నడుస్తూఉంటే
సమీపంలో ఎక్కడా జనసంచారం ఉండదు
చెట్లమీద ఆకు సైతం అల్లల్లాడదు
టెలిఫోన్ తీగలలో వార్తాప్రసారం సాగదు.

నిరుద్యోగి వెంట్రావు నగరం నడివీధిలో తన జీవితాన్ని తెరుస్తూఉంటే
ఎందుకో అకారణంగా సూర్యుడు ఖిన్నుడౌతాడు
ఆగ్రహం పట్టలేక భూదేవి బ్రద్దలౌతుంది
ధర్మదేవత ఉన్న ఒక కాలూ విరుచుకుంటుంది

నిరుద్యోగి వెంకట్రావు గాలిలో ధూళిలో ఎండుటాకులా సుడిగుండం తిరుగుతూ ఉంటే
నగరంలో గృహస్థులు ఆ రోజు సన్యాసం పుచ్చుకుంటారు
పిల్లలుగల తల్లులు బావిలో దూకుతారు
విద్యార్థులు పుస్తకాలు నడివీధిలో తగలబెడతారు

నిరుద్యోగి వెంకట్రావు నగరం గుండెలలో సాలీడులా అల్లుకుంటూఉంటే
ప్రభుత్వ భవనాలలో ఎక్కడా ఒక్కక్షణంపాటు ఎవరికీ ఊపిరి ఆడదు
కలం కాగితం పట్టుకున్న అధికారి చెయ్యి దానంతటదే
రాజీనామా పత్రంమీద సంతకం పెడుతుంది
ప్రభుత్వభవనాలమీద జెండా సిగ్గుతో తలవాల్చుకుంటుంది

నిరుద్యోగి వెంకట్రావు తన ఆకలిని రాళ్ళలో రప్పలలో దాచుకుంటూ ఉంటే
రాజకీయవేత్తలు వాటిని వేలంపాటలో కొనుక్కుంటారు
విషాదంయొక్క రంగు ఎలా ఉంటుందో తెలుసుకునేటందుకు
కవులూ చిత్రకారులూ అతని కన్నీళ్ళమీద పరిశోధనలు సల్పుతారు

అతని పాదధూళిలో చీకటి పుట్టుపూర్వోత్తరాలు వెతుకుతారు

నిరుద్యోగి వెంకట్రావు తన బాల్యస్మృతులు తలచుకుంటూ ఉంటే
నగరంలో పసిపిల్లలు ఆ పూట అన్నం ముట్టరు
పువ్వులు కోసుకుంటున్న పిల్లలను పాము కరుస్తుంది
దొడ్లో గున్నమామిడిచెట్టు ముమ్మాటికీ నేల కూలుతుంది.
నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరంమీద ఒక మచ్చ.

బాధ అనే దీపం పట్టుకొని
సర్వనాశనం అనే తాళంచెవిని పట్టుకొని
వెంకట్రావు జీవితం అనే చీకటి నరకకూపంలో
భయంకరమైన ఆశ్చర్యాలు ఇంకా అనేకం చూడవచ్చు
జీవితంమీద ఇంకా నమ్మకం ఉన్నవాడు
వెంటనే అక్కడే ఉరిపోసుకొని చావడం ముమ్మాటికీ సంభవం కావచ్చు.

నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరం ముఖంమీద నిజంగా ఒక మచ్చ
నిరుద్యోగి వెంకట్రావు చావడు
చావటం అనే మహాపాపం చెయ్యకుండా
న్యాయాధిపతులు ఎప్పుడూ అతన్ని కాపాడుతూ ఉంటారు
రోడ్లమీద భిక్షకులు అతనిలో ఎప్పుడూ కొత్తఊపిరి పోస్తూంటారు
జీవితమాధుర్యాన్ని గూర్చి చీమసైతం అతన్ని హెచ్చరిస్తూ వుంటుంది
నిరుద్యోగి వెంకట్రావు ఎన్నటికీ చావడు

అంచేతనే అందమైన ఈ సాయంత్రంవేళ నగరం అంతటా అపస్వరాలు
వెంకట్రావు నడుస్తున్నంతమేరా చెట్లు కూలుతున్న దృశ్యాలు

*

# కొత్త సంవత్సరం

కన్నులతో కాదు
గడియారాలతో చూడు
నా రూపాన్ని నీవు చూడవచ్చు.
అంకెల మధ్య
అక్షరాల మధ్య
గోడకు వేలాడిన కాగితాల మధ్య
విరిగిన మనో-రథాలనీ-
చిగిర్చిన వ్యాకు-లతలనీ-
మోసుకొచ్చే ఉత్తరాల మధ్య
రాలిన రోజాల మధ్య
కాలిన శిరోజాల మధ్య
ఆరిన దీపాల మధ్య
బద్దలైన అద్దాల మధ్య
ఎలక్ట్రిక్ స్తంభాలపైన ఎర్రని-
అపాయాల మధ్య
చెట్లకింద సకుటుంబంగా తారసిలే-
సంతాపాల మధ్య
సంకెళ్ళ మధ్య
ఏర్రటేపుల మధ్య
ఎలక్షన్ పవనాల మధ్య
రాక్షసుల పేరోలగాల మధ్య
నగరం అవయవాల లోపల-
నయం కాని గాయాల మధ్య
నలభై కోట్ల పేదవాళ్ళ-
గుడిసెల మధ్య
సూదుల మధ్య
డిశెంబర్ సంధ్యల మధ్య
సూర్యుడు రాని రోజుల మధ్య
గ్లోలేని రాత్రుల మధ్య
నిట్టూర్పులూ నిస్పృహలూ-
పుష్కలంగా లభించే-
రుతువుల మధ్య
నీ కంఠం నువ్వే ఉత్తరించు కుందా-
మనుకున్న క్షణాల మధ్య
కుట్రల మధ్య
సైతాన్ల మధ్య
ఛద్మ వేషాల మధ్య
నరకానికి వెళ్ళే రథ్యల మధ్య
భయాలనీ బీభత్సాలనీ-
చూపించే సొరంగాల మధ్య
నీడలో నీడలా నిన్ను వెంటాడే-
దగాల మధ్య
చిల్ల పెంకుల మధ్య
అడుసుతినే హస్తాల మధ్య
అప్పుడే పెదవి దాటిన-
ప్రాణ వాయువుల మధ్య
పొగ సహస్రముఖాలతో-
ఎదురయే పరిసరాల మధ్య
కుక్క గొడుగులు, కళ్ళూకాళ్ళూ-
లేని ఆకారాలు తప్ప మరేం-
కనిపించని గవాక్షాల మధ్య
సాలీళ్ళ మధ్య
తెల్లజెల్లేళ్ళ మధ్య
తురాయి పువ్వుల్ని తొడిగిన-
రావిచెట్ల మధ్య
కందచీమల కుత్కలాల మధ్య
నీకూ నీ నీడకూ మధ్య.

*

# ఆరుద్ర

రంజన కలిగిస్తాడన్నావు ఋషిలాంటి కవి
రంజన ఎలాంటిది ? ఎంతవరకూ దాని అలవి
అల్లసాని పెద్దన అన్నట్టు హరువు మొల్లమవడమా
ఆనందో[|]బహ్మ మందుకోవడమా అదేనా రంజన
మంచిరచన చదివాక బాగా భోంచేసినట్టుండాలి
కొంచెం బాధపడాలి చించుకొన్నట్టుండాలి
మనస్సుకి జ్వరం రావాలి ఒళ్ళు తిరగాలి
ఈ బాధలోంచి తేరుకొని బాగుపడాలి
ఋషిలాంటి కవి సందేశం వినిపిస్తాడన్నావు
మానవుడు ప్రాపంచిక భౌతిక ముముక్షువు
మంచి కవిత్వం తెరవాలి వాని జ్ఞానచక్షువు
నిత్య నైమిత్తికాలనుంచి నిరంతర సత్యాలదాక
ప్రత్యంశం గురించి ప్రవచించాలి మహాకావ్యం
రంజింపజేస్తూ సందేశ మిచ్చేదే మహాకావ్యం
అని నిర్వచనం చెయ్యడం చాలా భావ్యం
ప్రవాహంలా ఉంటుంది మహాకావ్యం
ప్రభావంలో పడేసుకుంటుంది మహాకావ్యం
తనవైపు ఆలోచనల్ని లాక్కునే సూదంటురాయి
సాపుచేసి హృదయాలని నిగనిగలాడించే ఆకురాయి
ఈ గుణాలు లేని కావ్యం కావ్యం కాదు బండరాయి
ఇది కవిత్వం గురించి పాలసీ స్టేటుమెంటు
ఇక చెప్పు ఎంతవరకు అవసరం కవిత్వంలో ఎక్స్పర్ మెంటు

('సాహిత్యోపనిషత్' నుండి)

## పెద్దముల్లు

పెద్దదాన్ని చెపుతున్నాను
వినండి, చెవిని పెట్టండి
అడక్కండి
రాజకీయ (ఛాందస) వైయాకరణినీ
విషమ విషయ పరిష్కారం
విషయమై ప్రశ్నించకండి
పృచ్ఛించకండి
వృశ్చికం నుండి వాడు
రాస్కెలు రాస్టలుడు నుమండి
వాడి అభిప్రాయాలు
గ్రాంథికాలే గాని
వ్యావహారికాలు కావు
స్వదేశ వ్యవహారాల శాఖ
అసమ్మతి అసమాపక క్రియ
వాడిందా లేదా !
వివిధ విదేశ వ్యవహారాల మధ్య
సవర్ణ దీర్ఘ సంధి
పొసగిందా ? లేదా ?
అన్ని శుష్క ప్రశ్నలే
అన్ని చచ్చు సందేశాలే
వాడివల్ల పరిష్కారం
వైకల్పికం
ఈ వ్యాకరణం కన్నా
గణితం పనికొస్తుంది
వ్యక్తిగత దరిద్రాలనీ
వర్గ కలహాలనీ
డొకలాడ పద్ధతిని
చేసేవారు మీరు
ఆశారేఖా గణితం రీత్యా
అభ్యుదయ బీజగణితం ద్వారా
సాల్వు చేద్దాం ఇప్పుడు
పైథాగరస్ థీరం
తీరానికి తీసుకెళ్ళగలదు
దత్తాంశాలను పరిశీలించండి
చిన్న చిన్న చీమలు వగైరా
అడుగు భుజం అనుకోండి
బలవంతమైన సర్పం
గట్రా ఎట్సెట్రా
అడుగు భుజం ఉత్పత్తి చేసే
ఆహారం మీద ఆధారపడ్డం వల్ల
లంబం అవదా మరి ?
ఈ భుజాల పరస్పర సంఘర్షణల ఫలితం
ఈ భుజాల
కర్ణం మీద చతురశ్రం
అవునా ? సరి
ఈ చతురశ్రపు వైశాల్యం
ఇజీక్వల్టూ
రెండు విభిన్న భుజాలపై
గల చతురశ్రాలలోని తమిస్రం
థీసిస్ యాంటీ థీసీసుల మిశ్రం
రెండు భిన్నపక్షసంజ్ఞల పోరాటం
అనగా ఒక నూతన అవస్థ
ఒక పునీత వ్యవస్థ అని ఉపపాద్యం
వామపక్ష నినాదాల పచరించి
వామపక్ష విధానాల చరించి
నిర్మాణ క్రమాన్ని చెయ్యండి
పెద్దదాన్ని చెప్పేను
వినండి, చెవిని పెట్టండి.

*

## నీటి గడియారం

నువ్వు ఎక్కదలచుకొన్న రైలు
ఎప్పుడూ ఒక జీవిత కాలం లేటు
ఏళ్లూపూళ్లూ నిరీక్షించ లేక
ఎక్కేస్తావేదో ఒక బండీ
నీ ఆదర్శాల లగేజీ
ఎక్సెసంటాడు టి.ఐ.సీ.
నీ ఈప్సితాల ట్రంకు పెట్లు
కలల బ్రేకులో పారెయ్యాలి
నువ్వు తెచ్చుకొన్న వన్నీ
ఎక్కించే లోపున
కదిలి పోతుంది బండీ
అందుకే అందులో కొన్ని
నీ అభిమాన హీరోల దగ్గరే
ఒదిలెయ్యి
నువ్వు వెళ్ళ దలచుకొన్న ఊరు
నువ్వు బతికుండగా చేరదా రైలు
దేవుడా ! ఇంత చేశావా అని
ఉన్న ఊళ్ళోనే ఉండు !

*

## తప్పదు

అల్లిన కథలాగ,అట్టమీదబొమ్మలాగ
మల్లెపూల దండలాగ మనోజ్ఞంగా
చల్లగాలి లాగ సేదతీరుస్తూ
ఎల్లాగూ ఉండదు కదా జీవితం
పాటుపడ్డం తప్పదు
పరితపించడం తప్పదు
రెక్కలమ్ముకొన్నా డొక్క నిండదని
ఎక్కడ పరచిన గొంగళీ
అక్కడే ఉంటుందని
తిట్టుకుంటూ, నిట్టూరుస్తూ
మట్టికొట్టుకుంటూ మళ్ళా మళ్ళామళ్ళా
కష్టపడుతూనే ఉంటావు కదా !
ఇంకొంచెం కష్టపడు
ఈ సారి నీ కోసమే కాదు
నీ లాంటి వాళ్ళందరి కోసం
నిట్టూర్చే అందం కోసం
నీలాగ, నీకోసం వాళ్ళూ పాటుపడితే
అల్లిన కథలాగ, అట్టమీద బొమ్మలాగ
చల్లగా సొగసుగా
రేపు ఉండకేం చేస్తుంది ?

*

## అవనీ

ఒసే ఒరే భువీ భువీ
పసందుగా లేవే
అసయ్యం నీ మొహం
అసింటా పోవే.
ఒరే ఒరే కవీ కవీ
సరే సరే కానీ
మనీ వినా మనాలనా
మనస్సిటే రానీ.
పుస్తె తెంచుకో పుట్టి ముంచుకో
పస్తుపడుకో ముష్టి అడుకో
విస్తరి మోస్తరు చంద్రుడు
కాస్తయినా అందడు.
నడూ నడూ ముందునడు
చెడామడా చెడు

కిందపడు మీద పడు
నిందించడు నిన్నెవడూ.
అంటలేక మిన్ను నిన్ను
కంటి నీట తడపనీ
జంటలేక బ్రతుకలే నంటావా అవనీ.
— మతి కొంచెం విడిచెయ్
బ్రతుకు చితుక పొడిచెయ్.
పతి విడిచి తిరుగుడు ?
ప్రతిరాజూ నీ మొగుడు !
— దగ్గరకే రాదు అఘం
బిగ్గరగా అరవకు.
మెత్తని పూదారి సుఖం
కత్తిమీద నడవకు.
చప్రాసీలా చంద్రుడు
అప్రెవూ తిరుగును
ఏప్రెలు ఫూలై ఇనుడు
చుప్రహో అనును
— హలా హలం కాఫీగా
సాఫీగా తాగుడు
దవానలం సాదాగా
సీదగా సాపడు.
సలసల మరిగే సలహా !
- వెల స్వల్పం వరహా !
అహహా ! - ఆహా !
నరుడా నీవరుడు? -మధువువాడివధువు
కవిత కంటిబిందువు-అవధిలేనిసింధువు

## తెలుగు సుబ్బోత్నిక్

ఫాక్టరీ గొట్టాల పొగకారుమేఘాలరీతిగ
దట్టంగా చంద్రుణ్ణి ముట్టడించేటి రో
జు, పంచాంగాలలో అచ్చు కేసుల్లోమ్యూ
జియమ్లలోకూడా ఉపమానంగా నైనాకూ
డా ఉండకుండా బూర్జువా దోపిడీ
ఫ్యూడలిజం విధంగా ఉండీ అమావాస్యచీ
కట్లని-జీవనదులలోని నీళ్ళని తమ ర
క్తం మాదిరిగా ప్రాణం మాదిరిగా కూడా
ఎంచుకొని లోభంగా ఆనకట్టలు కట్టి దా
చు కొనగా తయారయే విద్యుచ్ఛక్తి
పటాపంచలు చేస్తే ఊళ్ళోగాలీ వెలుతు
రూ తప్ప మరెవరూ లేరనిపించేటటు ఉం
డే రోజు-విశాలంగాను వస్త్రాదులు ఉస్తాదు
లు వీళ్ళకి కండలు తప్ప మెదడు తప్ప
ఆనందం తప్ప ఇంకేమీలేదనిపించేరోజు
వీళ్లందరిలో ఏనాడో ఉండే అజ్ఞా
నం పరిగెత్తి పరిగెత్తి పారిపోలేక
రోడ్ల మీద పడిపోయి లేకలేక పడి ఉం
దన్నట్లు రోడ్లన్నీ తారు పూతతో
కనబడుతూ ఉండే రోజు కావాలి.
నాకు-నాకు కావాలి ఆరోజు మట్టుకే
కావాలి కావాలి నాకది తప్ప మ
రేదీ అక్కర్లేదు ఉహూ ఇవాళా! నిన్నా!
పొండ్రా అంతా లేకపోతే తంతా ! **

# కాళోజీ

## మాతృదేశము

మాతృదేశము మాటముచ్చట
ముదము గూర్చదు మదికి ననియెడి
పరమ నీచుడు ధరణి నంతట
గలయ వెదకిన గాననగునా ?
నీరులేని యెడారియైనను
వాన వరదల వసతియైనను
అగ్గికొండల అవనియైనను
మాతృదేశము మాతృదేశమె.
దేశదేశము తిరిగిచూడుము
కొంత హాయియె కూర్చుమదికిని
నాల్గురోజులు నచ్చదేదియు
స్వర్గమే నపవర్గమేనియు.
తల్లిఏడుపు తండ్రి కోపము
భార్య బిడ్డల ప్రణయపాశము
ఇంచుకయు గణియింప నీయదు
మాతృదేశము మాతృదేశమె.
లాఠిదెబ్బల లక్ష్యమేమీ
కఠినశిక్షయె కాదు కాదు
చావుకైనను జంకనీయదు
మాతృదేశము మాతృదేశమె.
పొట్ట కన్నము, కట్ట బట్టయు
లేని బ్రతుకును లెక్కసేయక
యెచ్చటికి బో నిచ్చగింపము
మాతృదేశము మాతృదేశమె.
స్వర్గమే అపవర్గమే యని
చాటిచెప్పెడు జన్మభూమియె
పరుల వశమున నరకకూపము
కన్న హేయము కఠినతరము.

## చాదస్తం

ప్రతి చాదస్తం దేవుడే
ఏదో ఒక రూపంలో గోకుడే
పుట్టుకతోనే పుట్టు నీ వుండు
అగపడక అంతరంగాన నుండు.
భావానుగుణ్యం రూపం
శక్తినిబట్టి సాక్షాత్కారం.
సిగము పూనిస్తుంది ఉపాసన
గిట్టదు గిట్టదు మరొక వాసన.
రామభక్తుడైన హనుమంతుడు
కృష్ణుని ఆనవాలు పట్టడు
నస్యం జూస్తే యేవగింపు
జర్దారూపంలో గిట్టునుకంపు.
నామరూపాలు అనంతం
ఎవనిది వానికే వసంతం.
అనుభూతి వర్ణనాతీతం
'సత్యం శివం సుందరం'
ప్రతి రంగాన దీనిదే చిక్కు
గాయానికి కట్టనీదు పక్కు
హాయి. గోకినాకొద్దీ హాయి
మంటను లెక్కింపని స్థాయి.
వ్యసనాలు, మహావ్రతాలు
వ్యక్తిగత చాదస్తాలు.
దరిదాపున చేరిన మౌఢ్యం
వ్యాపింపజేయు నీ జాడ్యం
ముఠాబందీ సిద్ధాంతాలు
ఈ జాడ్యానివే వ్యాపకరూపాలు.
ఒక సిద్ధాంతము పూనినపుడు కసి
మరొకదానిని చేస్తుంది మసి.

ప్రబోధ నినాదాల పొరలు
గాలాలను దాచే ఎరలు.
"భ్రమర కీటక న్యాయం"
రంగు రుద్దుటకు సాయం.
ఊబిలో పడిన ప్రతివాడు
ఆనందాబ్ధి అని అంటాడు. *

## పోటీపడి కాటులాడ...

చాపచింపు-సామ్రాజ్యం
కోడిగుడ్డు-కోహినూరు
పాటిమన్ను-ప్లాటీనం
బస్సుసీటు- బ్రహ్మ రథం
ఏదైతేం? ఏదైతేం?
అడవిమనిషి-ఆచార్యుడు
పసిబాలుడు-పండుముసలి
బిచ్చగాడు-లచ్చిమగడు
తొత్తుకొడుకు-పెత్తనదార్
ఎవడైతేం? ఎవడైతేం?
పోటీపడి కాటులాడ ఎవడైతేం?
తండ్రి-కొడుకు, తల్లిబిడ్డ
అన్నదమ్ము-డక్కచెల్లె
బావమరిది భార్యభర్త-ఇ
రుగు పొరుగు ఎరుగనోరు
ఎవరైతేం? ఎవరైతేం?
పోటీపడి కాటులాడ ఎవరైతేం?
విపణివీధి-తపోవనం
చాకిరేవు-శాసనసభ
సానికొంప-సాధుమఠం
మూత్రశాల- యాత్రస్థలి
ఎచటైతేం? ఎచటైతేం?
పోటీపడి కాటులాడ ఎచటైతేం? *

## తస్మాత్ జాగ్రత్త! జాగ్రత్త!

అభ్యర్థి ఏ పార్టీవాడని కాదు
ఏపాటివాడో చూడు
ఎన్నుకుంటె వెలగబెట్టటం కాదు
ఇందాకా ఏం చేశాడో చూడు
ఇప్పుడు కట్టే ముడుపులు కాదు
ఇందాకా చెల్లించింది చూడు
పెట్టుకునే టోపీకాదు-పెట్టినటోపీ చూడు
ఎగరేసిన జండాకాదు
చాటున ఆడించిన దండా చూడు
మనిషిని చూడు చరిత్రను చూడు
నుడువులు కాదు నడవడి చూడు *

## పునరావృతి

ఉదయం కానేకాదనుకోడం నిరాశ
ఉదయించి
అట్లానే ఉండాలనుకోడం దురాశ
ఈ చీకటి ఉండదు—
సూర్యుడు తప్పక ఉదయిస్తాడు.
ఆ వెలుతురు నిలవదు—
సూర్యుడు మళ్ళీ అస్తమిస్తాడు.
చీకటిలో కనువిప్పినవారికి
వెలుతురంటే బూచి
వెలుతురులో
కనుతెరిచినవారికి
చీకటంటె పిశాచి
ఇదే జరుగుతూ వచ్చింది
ఇంతకుముందు.
ఇదే జరుగుతుంది
తప్పదు ఇకముందు.

## ఆంధ్రుడా

ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈ భాష ఈ వేష మెవరికోసమురా ?
ఆంగ్లమందున మాటలాడ గల్గగనే
ఇంతగా గుల్కెదవు ఎందుకోసమురా ?
సూటు బూటు హ్యాటు షోకుగా దొడుగ ఘనతేమి వచ్చెరా గర్వమేటికిరా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈ భాష ఈ వేష మెవరికోసమురా ?
ఉర్దు మాటలాడి యుబ్బుబ్బి పడుటకు కారణంబేమిటో కాస్త చెప్పుమురా ?
లాగు షేర్వాణీలు బాగుండుననుచు
మురిసిపోయెద వంత మురిపెమేమిటిరా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈ భాష ఈ వేష మెవరికోసమురా ?
నీ వేషభాష లిల నిగ్గుదేలినవన్న
విషయంబు నీవేల విస్మరించెదురా ?
నీ భాష దీనతకు నీ వేషదుస్థితికి కారకుడ నీవ యని కాంచవెందుకురా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈ భాష ఈ వేష మెవరికోసమురా ?
నీ వేషభాషలను నిర్లక్ష్యముగ జూచు భావదాస్యంబెప్డు బాసిపోవునురా ?
నీ భాషయందును నీ వేషమందును అభిమాన ముడిగిన అనదవీవెరా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈ భాష ఈ వేష మెవరికోసమురా ?
దేశభాషలయందు తెల్గులెస్సయటంచు
తెలుగుబిడ్డా ! యెప్డు తెలుసుకొందువురా !
తెలుగు బిడ్డవురోరి తెల్గు మాట్లాడుటకు
సంకోచపడియెదు సంగతేమిటిరా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈ భాష ఈ వేష మెవరికోసమురా ?
తెలుగు బిడ్డడవయ్యు తెల్గు రాదంచున్న

సిగ్గులేక ఇంక జెప్పుటెందుకురా ?
అన్యభాషలునేర్చి ఆంధ్రంబు రాదంచు
సకిలించు ఆంధ్రుడా ! చావవెందుకురా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈ భాష ఈ వేష మెవరికోసమురా ?

*

## ఉడుత భక్తి

వారధికని వచ్చి పడెడి రాయికి రాయికి మధ్య
పరాయితనము తగ్గింపగ ఉడుత రాల్చినట్టి ఇసుక,
రామన్నకు కన్నతల్లి లాలన గుర్తుకురాగా
బోసినోటి అమృతాన్ని సేవించిన రేగుపండు,
ఊసులుతోడిన కన్నులు రక్తము కారెడి శివునకు
కాళహస్తిలో కన్నడు కోసిచ్చిన కన్నుదోయి,
ఆకలిగొన్నట్టి అన్న కందింపగ మిగిలివున్న
పూరిగుడిసె ద్రౌపదమ్మ అంట్లగిన్నెలోని అంటు,
అతిథిని సంతృప్తిజేయ అపరిగ్రహవ్రతుని గృహిణి
అన్నపూర్ణ అందించిన పరిగెగింజ పిండివంట
గాయపడిన అన్న వ్రేలు చుట్టేయగ చెల్లాయి
చేతులార చించుకున్న ఒంటిమీది చీరఅంచు
కూటిపేద కుచేలయ్య తడబాటును లెక్కింపక
లచ్చి మొగని నోరూరగచేసిన పిడికెడు, అటుకులు,
ఏటూరి నాగారం కోయదొర యుద్ధనిధికి
అందింపగ ఏటేటా కూడేసిన లచ్చివెలుగు,
శరణార్థిని అని అనబడు పురుషార్థిని పూలదేవి
దాదియమ్మ భరతమాత నూటా నలుబది రూకలు,
కానిరోజు కటకటతో పోరాటము సలిపి బ్రతుకు
బిచ్చమెత్తుకొను లచ్చిమి దయతో పెట్టిన నూకలు
కాశీనగరపు వాసి కాపుబిడ్డ, కరుణమూర్తి
శివ్వన్న శివముబూని ఇచ్చేసిన ఒంటెద్దు
వైయాకరణులు నవ్వగ ఛాందసులు ఇగిలింపగ
ఆతరపడి ఎడదచించి కట్టిన అక్షర రక్ష.

**

# కుందుర్తి

## నా గీతం

నేను గీతాన్ని
ఎండిపోయి పండని బ్రతుకు పొలంలో
సకాల వర్షపాతాన్ని;
కుందుర్తిగుండె కొండశిఖరాలనుండి
పరుగులెత్తిన భావ జలపాతాన్ని;
ముక్కోటి తెనుగుల మూగగొంతుల సంగీతాన్ని;
ఛందస్సు బంధాలకు పక్షవాతాన్ని;
పీడకులకు నిద్రించకుండా వదలని పెనుభూతాన్ని;
బ్రతుకులోని పీడకలల
తలలమీద అశనిపాతాన్ని;

రైతుగుండెలో రాజు చేసిన ఘాతాన్ని
ఆకలితో మరణించిన కూలివాడి ప్రేతాన్ని;
గుమాస్తా జీవితాన్ని గడపలేని జీతాన్ని;
వర్ణిస్తాను; బ్రతుకు కష్టగాథల బంగాళాఖాతాన్ని

నేను పాటను
అసత్యం కత్తిలేని బంగారం మాటను
రైతులతో పొలందున్నే చల్దిమూటను
బెదిరింపుల ఫిరంగులకు
చెక్కుచెదరని ఉక్కుకోటను;
రచనల పూలతోటలో
ఛందస్సు మొక్కలు నాటను;
భావనలో సామాన్యుని
జీవితం వలయాలు దాటను;

పనిపాటలు లేక బ్రతుకు జరగని కూలీలపేటను
ప్రతియింటిలో తిండిలేని పూటను
ప్రభుత్వాలు సరదాగా చేసే మనుషుల వేటను
వర్ణిస్తాను; బ్రతుకుబాధల ముళ్ళబాటను.

నేను గేయాన్ని
ప్రజల గుండెలో యింకా మాయని గాయాన్ని
మృతవీరుల ధ్యేయాన్ని
పరిపాలనలో ప్రజల ప్రమేయాన్ని
ప్రభుత్వాలమీద ప్రజలు వేసే దావాలకు భావాల ఉపాదేయాన్ని
స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు ఉపమేయాన్ని
ఛందస్సు పరిశ్రమలకు ఆపేసిన ప్రభుత్వసహాయాన్ని

చరిత్ర ఒడుదుడుకుల నడకకు వచ్చిన అపాయాన్ని
సమతా సమాజ సాధనకు ప్రజాబలం చెప్పిన ఉపాయాన్ని
జాతికీ-అవినీతికీ జరిగే సంఘర్షణ సముదాయాన్ని
వర్ణిస్తాను; బ్రతుకు పోరాటాల నికరాదాయాన్ని.

*

## చేసేదీ-చెయ్యంది

మనిషి మనసులోంచి మంచినీటి జలలు తెప్పిస్తాను
కలలవిలువ పొలాలు పంచడానికి కవులందర్నీ ఒప్పిస్తాను
శ్రమచెట్టుకు నీళ్ళుపోసిన కూలివాడికి స్వరాజ్యం యిప్పిస్తాను
వచ్చిన రాజ్యంలో రసపిపాసువులందరికీ ఆకలిదప్పులు తప్పిస్తాను
కవితా విమర్శల ఎన్నికలో మిమ్మల్ని మెప్పిస్తాను

ఇకమీదట లెక్కచెయ్యను లోపలి సందేహాల ఉరికొయ్యను
పాడుతున్న పాటను హఠాత్తుగా ఆపెయ్యను

బ్రతుకుసముద్రం ఉప్పునీటి లోతుల్లో పర్యటిస్తాను
దొరికిన సత్యాల ముత్యాలు, గీతాల గోతాల కెత్తిస్తాను
నవకవనం భవననిర్మాణంలో కవులందర్నీ పనిచేయిస్తాను
జగతి గుండెలోని మూగజీవాల సంగీతాలు పైకితీస్తాను
సరికొత్త రీతులు నిర్మించి పెద్ద రాగాలు తీస్తాను

ఇకమీదట కన్నెత్తిచూడను గుండెలో భయంకట్టిన జైలుగోడను
ఆ అర్థం వచ్చే మాటలు పాటల్లోకూడా వాడను

ఉదయం హృదయంలో గులాబీచెట్టు నాటిస్తాను
చవుళ్ళు సారవంతంచేసి కవుళ్ళు రద్దుచేస్తాను
కవులందరితో సమిష్టిగా వ్యవసాయం చేస్తాను
హేతువు సస్యాన్ని జాతిపరం చేస్తాను, మనిషిచెట్టుకు నీతిపూలు పూయిస్తాను

ఇకమీదట లోపలికిపోను బ్రతుకుబాట నిర్మించిన చిత్రహింసలబోను]
మాటలోని కొన్ని అక్షరాలకు అర్థం లేదనుకోను.

*

## తిరుగుబాటు

తిరుగుబాటు-కాలానికి కలిసిన చుట్టం
ప్రతి యుగానికీ అంతిమ ఘట్టం

స్మృతికందిన చరిత్రగీసిన రంగురంగుల బొమ్మ
మృతవీరుల ఆశయాల ఆజ్ఞలు మోసుకుతెచ్చిన కమ్మ
కవితకు ఓంప్రథమంగా 'శ్రీశ్రీ' పెట్టిన షరతు
ఉన్నతీరు క్రింద నేను కన్నతీరు పెట్టిన యెర్రసిరాగురుతు.

పుడమి సూర్యుణ్ణి చుడుతుందని మొదటిసారి చెప్పిన నోరు
అడిగించుకోక ప్రతిపక్షాన్ని వరించిన ప్రతి ఊరు,
కోయదొరల ములుకుమొనకు రామరాజు పెట్టిన నోరు
న్యాయవిచక్షణలేని హింసకు ఎదురెక్కిన ప్రతి ఊరు.

పతి మరణించిన పడతికి శిరస్సున తరగని కొప్పు
తిథినాడు ఉదయం తాగిన మొదటి కాఫీకప్పు
సినిమాల అను మాలను మరపించిన మాలపిల్ల
తియ్యతియ్యగా మనరోగాలను తినేసే హోమియో బిళ్ళ.

నాడు రాజప్రతినిధి రైలుక్రింద బాంబులు పెట్టిన గుండె
నేడు పొట్టకాలిన చేనేతకు దొరికీ దొరకని నూలుకండె
ఉరికంబం పదును కొలచి పాటలుపాడిన గొంతు
కాలం కాలానికి గంతు-నేటికి నీకు నచ్చిన వంతు.

తిరుగుబాటు - ముక్తిచాటు
నీకు బాట—
నాకు పాట!

*

## నాలోని నాదాలు రెండు

కాలం జీవనదిలా పరుగెడుతుంది
మనిషి బ్రతుకు కడివెడు నీళ్ళు;
అవివేకానికి మందులేదు;
అనుభవించటం తప్ప
తెలివి ఒక్కటే నది దాటించే తెప్ప.
అనంతకోటి కోర్కెల కొసలు
ఆప్యాయంగా కొరికే
జీవితం ఒక వంద ఏండ్ల పరుగు
హఠాత్తుగా ఎక్కడ ఎదురవుతుందో
అసలు వస్తువు
అందుకోటానికి లోపల పెరుగు!
పరిమళంలేని పూవులా-
రాలిపోవడమెందుకు?
సరస్సులో పద్మంలా-
తెలివికి తేరుకోవడం మేలు.

*

## ముప్పై ఒకటి

ఒక అవకాశవాదపు గొడుక్కింద
వందమంది యిరుక్కుంటారు.
ఆశ అనే పెనుగాలికి ఎగిరి
ఆకసంలో తిరుగుతుంటుంది గొడుగు
అందరూ పట్టుకొని వ్రేలాడుతుంటారు
అంధినంతవరకు దాన్ని పట్టుకొని.
అప్పుడొకడు అప్పుడొకడు
పట్టుసడలి రాలిపడుతుంటారు క్రింద
తనువు చాలిస్తున్న తారల్లా
తళతళలాడుతూ కొందరూ
క్షణమాత్రంలో కరిగిపోయే
వడగండ్లలా వడివడిగా కొందరూ
ఎందరో మహానుభావులు
అందరికీ వందనాలు.
చక్రాంకితాలు చెరిపేసుకొని
శైవమతం పుచ్చుకునేవారు కొందరూ
అడ్డబొట్లు అమాంతం మానేసి
పంగనామాలు పెట్టేవారు కొందరూ—
ఎన్నికల ఫలితాల నాటి బలాబలాలు
మర్నాటికి మారిపోతుంటే
దిగాలుపడి చూస్తుంటారు పాపం ప్రజలు.
కోతిలోంచి మనిషి పుట్టాడని
చెప్పాడొక మహానుభావుడు
అసలుమాట నిజమో కాదోగాని
అది వ్యంగ్యమైతే పరమసత్యం!
తప్పతాగి తైతక్కలాడే కోతి
నిప్పుత్రొక్కి చిందులేస్తున్నట్లు
అవినీతి నృత్యం చేస్తున్నాడు మానవుడు.
దేవుడు చేసిన పాపమంతా
మనిషిలా గడ్డ కట్టింది కాబోలు!
కాలం కాంత ఫాలంమీద కస్తూరి తిలకం
స్వయంగా తనచేతుల్తో
తుడిచేసాడు మానవుడు.
తనకే తెలియని గమ్యంవైపు
తలక్రిందుగా నడుస్తున్న మనిషినిచూసి
దిగాలు పడుతున్నాడు దేవుడు.

**

# దేవరకొండ బాలగంగాధర తిలక్

## నా కవిత్వం

నా కవిత్వం కాదొక తత్త్వం
మరి కాదు మీ రనే మనస్తత్త్వం
కాదు ధనిక వాదం, సామ్యవాదం-
కాదయ్యో అయోమయం, జరామయం.

గాజు కెరటాల వెన్నెల సముద్రాలూ
జాజిపువ్వుల అత్తరు దీపాలూ
మంత్రలోకపు మణిస్తంభాలూ
నా కవితా చందన శాలా సుందర చిత్రవిచిత్రాలు.

అగాధ బాధాపాథః పతంగాలూ
ధర్మవీరుల కృతరక్తనాళాలూ
త్యాగశక్తి ప్రేమరక్తి శాంతిసూక్తి
నా కళాకరవాల ధగద్ధగరవాలు.

నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు.

*

## అమృతం కురిసిన రాత్రి

అమృతం కురిసినరాత్రి
అందరూ నిద్రపోతున్నారు
నేను మాత్రం—తలుపు తెరచి యిల్లు విడిచి
ఎక్కడకో దూరంగా
కొండదాటి కోనదాటి
వెన్నెల మైదానంలోకి వెళ్ళి నిలుచున్నాను.

ఆకాశంమీద అప్సరసలు
ఒయ్యారంగా పరుగులెత్తుతున్నారు

వారి పాదాల తారా మంజీరాలు
ఘల్లుఘల్లని మ్రోగుతున్నాయి
వారి ధమ్మిల్లాల పారిజాతాలు
గుత్తులు గుత్తులై వేలాడుతున్నాయి
వారు పృథు వక్షోజ నితంబ భారలై
యౌవన ధనుస్సుల్లా వంగిపోతున్నారు

నన్ను చూసి కిలకిల నవ్వి యిలా అన్నారు
చూడువీడు— అందమైనవాడు, ఆనందం మనిషైనవాడు
కలల పట్టు కుచ్చులూగుతున్న కిరీటం ధరించాడు
కళ్ళ చివర కాంతి సంగీత గీతాన్ని రచిస్తున్నాడు
ఎఱ్ఱని పెదవుల మీద తెల్లని నవ్వుల వీణల్ని మీటుతున్నాడు
ఎవరికి దొరకని రహస్యాన్ని వశపరచుకున్నాడు
జీవితాన్ని ప్రేమించినవాడు జీవించడం తెలిసిన వాడు
నవనవాలైన ఊహావర్ణార్ణవాల మీద ఉదయించిన సూర్యుడు
ఇతడే సుమీ మనప్రియుడు నరుడు మనకి వరుడు.

జలజలమని కురిసింది వాన, జాల్వారింది అమృతంపుసోన
దోసిళ్ళతో తాగి తిరిగి వచ్చాను, దుఃఖాన్నీ చావునీ వెళ్ళిపొమ్మన్నాను
కాంక్షామధుర కాశ్మీరాంబరం కప్పుకున్నాను
జీవితాన్ని హాస న్మందార మాలగా ధరించాను
జైత్రయాత్రాపథంలో తొలి అడుగు పెట్టాను.

అమృతం కురిసిన రాత్రి-అందరూ నిద్రపోతున్నారు
అలసి నిత్యజీవితంలో సొలసి సుషుప్తి చెందాను.
అలవాటునీ అస్వతంత్రతనీ కావలించుకున్నారు
అధైర్యంలో తమలో తాము ముడుచుకుపోయి పడుకున్నారు
అనంత చైతన్యోత్సవాహ్వానాన్ని వినిపించుకోలేకపోయారు

అందుకే పాపం
ఈనాటికీ ఎవరికీ తెలియదు
నేను అమరుడనని!

*

# నగరంమీద ప్రేమగీతం

టాంక్ బండ్ సన్నని నడుంచుట్టూ చెయ్యిచుట్టి
అందమైన నగరముఖాన్ని దగ్గరగా తీసుకొని
ఆశలతో అలసమైన అబిడ్స్ కళ్ళలోకి చూసి
దీపాల వెలుతురు ప్రతిఫలించే చెక్కిళ్ళపై ముద్దుపెట్టుకో.

సిగలో నౌపహాడ్ నాగరం తళుక్కున మెరుస్తుంది
బంజారాహిల్స్ వక్షోజాలు ద్రిక్తంగా చలిస్తాయి
అలాఅలా నైలాన్ చీరకింద మెత్తని గాగరాలో
సికిందరాబాద్ జఘనోరు సౌందర్యం నిన్ను కవ్విస్తుంది.
వేలవేల బార్లలో కొన్నివేల నిషాగీతాల మధ్య
బాశిగొలిపే జవరాలి నృత్యం పరవశింప చేస్తుంది
ఓరగా తెరిసిన జనానాల తలుపులలోంచి
ఉండి ఉండి నిలవగాలి వస్తుంది
హుసేన్‌సాగర్ మీద ఒలికిన వెన్నెలలోంచి
ఒక విరహిణి మధుర విషాధగాథ వినిపిస్తుంది.

వాడిన పువ్వుల వాసన వేడివేడి పాదాలకు తగులుతుండగా
రోడ్లమీద అజ్ఞాతకామం ప్రతిరోజూ రాత్రి ప్రవహిస్తుంది
తెలుగువాళ్ళ తెలివిలేనితనం ధోవతికుచ్చెళ్ళతోపాటు మోటుగా
ఎం. ఎల్. ఎ. క్వార్టర్స్ దగ్గర ఎబ్బెట్టుగా జీరాడుతుంది
దర్బారులో సిగ్గుల్నీ, వగల్నీ ఒలకబోసే నెరజాణతనం నుండి
దాపరికంలేని పారిశ్రామిక నాగరికతా నగ్నత్వంలోకి
ఎదుగుతూన్న నగరసుందరిని ఒదులొదులుగా కౌగలించుకో.
మదం, ముదం, మృగమద పరీమళం మత్తెక్కిన కన్నుమూతలో
పెట్రోలు వాసన ఫెళ్ళుమని తగిలి ఉలిక్కిపడతావు.

మూసీనది మురికి శృంగారాన్నీ, పాపకశ్మలాన్నీ
మౌనంగా, దీనంగా మోసుకుపోతూ వుంటుంది,
ముసలిగద్ద చార్మినార్ మీద గతవైభవాన్ని తలుచుకొని
మూలుగుతూ "మోసం!" అని అరుస్తుంది.

అయినా యౌవనం తగ్గలేదు, లావణ్యం తగ్గలేదు, మెహబూబ్ జిందాబాద్!
ఫ్యూడల్ రహస్యాల్ని నేటికీ దాచుకున్న పుండ్రేక్షు కోదండం హైదరాబాద్! *

# ప్రార్థన

దేవుడా
రక్షించు నా దేశాన్ని
పవిత్రులనుండి
పతివ్రతలనుండి
పెద్దమనుషులనుండి, పెద్దపులులనుండి
నీతుల రెండునాల్కలుసాచి బుసలుకొట్టే
-నిర్హేతుక కృపా సర్పాలనుండి
లక్షలాది దేవుళ్ళనుండి
వారి పూజారులనుండి,
వారి వారి ప్రతినిధులనుండి
సిద్ధాంత కేసరులనుండి సిద్ధులనుండి
శ్రీమన్మద్గురు పరంపరనుండి

దేవుడా
నలభై కోట్ల మనుష్యుల
నిజమైన ప్రాణం వున్న మనుష్యులతో
నిండిన దేశం నాది

ఆకలి బాధలూ,
ఆందోళనలూ, సమస్యలూ
విరివిగావున్న విచిత్ర సౌధం మాది
కడుపునిండుగా ఆహారం
గుండెనిండుగా ఆశ్లేషం
బ్రతుకు పొడుగునా స్వతంత్రం
కొంచెం పుణ్యం
కించిత్ పాపం
కాస్త కన్నీరూ
మరికాస్త సంతోషపు తేనీరూ
చాలు మాకు తండ్రీ

సరదాగా, నిజాయితీగా
జాలిజాలిగా
హాయిహాయిగా బ్రతుకుతాం
మాకు నటనలు వద్దు
మా చుట్టూ కటకటాలు వద్దు
గొప్పలూ గోసాయి చిట్కాలు వద్దు

దేవుడా
కత్తి వాదరకు
తెగిన కంఠంలో హఠాత్తుగా
ఆగిపోయిన సంగీతాన్ని వినిపించు
మానవ చరిత్ర పుటలో నెత్తురొలికి
మాసిపోయిన అక్షరాల్ని వివరించు
రహస్య సృష్టి సానువులనుండి
జారిపడే
కాంతి జలపాతాన్ని చూపించు
మమ్మల్ని కనికరించు
చావుపుట్టుకలమధ్య సందేహంలాంటి
జీవితంలో నలువైపులా అంధకారం
మంచి గంధంలాగ
పరిమళించే మానవత్వం
మాకున్న ఒకేఒక అలంకారం

మజిలీ మజిలీకి అలసిపోతున్నాం
మలుపు మలుపుకీ రాలిపోతున్నాం
ఆశల వెచ్చని పాన్పుమీద
స్వప్నాల పుష్పాలు జల్లుకొని
ఆదమరచి
కాసేపు
విశ్రమించడాని కనుమతించు తండ్రీ. *

# దాశరథి

## శ్రమిక జాతి

తరతరాల దరిద్రాల
బరువులతో కరువులతో
క్రుంగి క్రుంగి
కుమిలి కుమిలి
కష్టాలకు నష్టాలకు
ఖైదులకూ, కాల్పులకూ
సహనంతో శాంతంతో
బలిపశువై తలవాల్చిన
దీన పరాధీన జాతి
శ్రమిక జాతి
దెబ్బతిన్న బెబ్బులివలె
మేల్కొన్నది
మేల్కొన్నది.
విశ్వ విపణి వీధుల్లో
చావు చాల చవకైనది.
బ్రతుకుకు బ్లాక్ మార్కెట్ ధర;
వ్యాపారులు ప్రపంచాన్ని
తుంచుకొని పంచుకొని
పరిపాలిస్తున్నారు.
రైతు కూలి ప్రజలంతా
ధనికుల పాదాల క్రింద
చీమలవలె చితికినారు.
శ్రమజీవుల రక్తధార
జలం కన్న పలచనైంది
పరతంత్రత దరిద్రత
గిరులవోలె పెరిగినాయి.
శాంతానికి సహనానికి
దహనక్రియ జరిగింది.
చెలియలి కట్టలు దాటిన
ప్రళయకాల జలధివోలె
తిరుగుబాటు పరచుకుంది.
విశ్వరుద్ర ఫాలంలో
విప్లవాక్షి విరిసింది.
పరతంత్ర ప్రజాకోటి
ప్రళయవృష్టి కురిసింది.
స్వాతంత్రోద్యమ శంఖం
దిగంతాల మొరసింది.
పొగులుతున్న భూగర్భం—
పగులనున్న జ్వాలాముఖి—
చిచ్చంటిన స్నిగ్ధాటవి—
పిడుగులురలు పెనుమేఘం—
హరగళగత హాలా హలం
శ్రమిక జాతి కదిలింది.
ప్రజాద్రోహి వర్గానికి
లయకాళిక శ్రమిక జాతి—
జగద్విప్లవ గళంలో

జయమాలిక శ్రమిక జాతి—
మేల్కొన్నది
మేల్కొన్నది.
*

## అనంత సంగ్రామం

అనాదిగా సాగుతోంది
అనంత సంగ్రామం
అనాథుడికీ, ఆ గర్భ శ్రీనాథుడికీ మధ్య.
సేద్యం చేసే రైతుకు
భూమిలేదు, పుట్రలేదు,
రైతుల రక్తం త్రాగే
జమీందార్లకె స్టేట్లు.
మిల్లు నడిపి, కోట్ల డబ్బు
కొల్లగ లాభం తెచ్చే
కూలోనిది కాదు మిల్లు,
మిల్ మ్యాగ్నేటొక సేటు.
శత్రువులను యుద్ధంలో
చిత్రంగా వధచేసిన
పేద సైనికునికి 'సున్న'—
రాజ్యమంత రాజులదే.
మథనపడే మేధావులు
శాస్త్రజ్ఞులు, విద్వాంసులు
కనిపెట్టిన అణుశక్తికి
ప్రభుత్వాల కంట్రోళ్లు.
కర్షకులు, కార్మికులు
మథనపడే మేధావులు
తమ శ్రమలకు తగిన ఫలం
ఇమ్మంటే "తిరుగుబాటు!".
షావుకారు వడ్డీలకు
జమీందార్ల హింసలకు
వేగలేక ఆగలేక
తిరగబడితే "అతివాదం?".
*

## ఉద్భ్రాంత యువశక్తి

కొత్తపాట పేరుతో చెత్తపాట పాడకు
కొత్తదనం నీడలో రిత్తదనం పెంచకు
గుడ్డవిడిచి నడ్డివిరిచి రోడ్డుమీద నడవకు
ఇజాలతో భుజంకలిపి నిజం దాచజూడకు.
విడగొట్టే వారుందురు,
చెడగొట్టేవారుందురు
ముచ్చెరగుల నొక్కటిగా ముడివేసే
వారరుదు
పెడదారిని పట్టించే "పెద్దలు" ఉన్నారు
కాని
మంచిదారిలో నడిపే మాన్యులెవరు
కానరారు.
భారతీయ యువకుడా! దారితప్పకు
అనుకరించి అనుసరించి
అశక్తుడవు కాబోకు.
పిల్లికూత-సంగీతం పేరిట వినిపించకు
పిచ్చిగీత-నవకళగా వీధులలో చాటకు
బూతు వ్రాసి-నవకవితా రీతిగా నటించకు
గంతులేసి-నవనాట్యం
ఇంతేనని ప్రవచించకు.
దయ్యాన్నే దైవమని
కయ్యానికి లేవకు;
మారుతుంది కాలమనే మాట మరువకు.
హింసనుండి సమసమాజ

హంస ఉద్భవించుననే
అసత్యాన్ని నమ్మకు
హంతకుడవు కాబోకు.

*

## తిమిరంతో సమరం

పిచ్చుకపై బ్రహ్మాస్త్రం
వేసేవారున్ననాడు
అవనిపైన శాంతిలేదు
అని సేయుట ఆగిపోదు.
ఎత్తులపై ఎత్తులతో
జిత్తులపై జిత్తులతో
ఎత్తే విజయ పతాకం
ఎన్నాళ్ళని యెగురుతుంది!
సురక్షిత స్థలాలలో
సుదూర ప్రాంతాలలో
కూర్చుని నాయకమ్మన్యులు
తీర్చుతారు కుపథకాలు.
వేలమైళ్ళ దూరాన
విలయతాండవం చేసే
మృత్యుదంష్ట్రిలందు పడి
పిండైపోయేది ప్రజలు.
ఎంత వినాశనం జరిగెను?
ఎందరి అసువులు పోయెను!
బ్రతికిఉన్నవారి యెడల
చితులెన్ని రగుల్కొనెను.
అయ్యో! ఈ రాజకీయ
హాలాహల సంతర్పణ!
ఎంతకాల మిలా ప్రజా
హంతకులకు ఆనందం!

కూడులేని కోట్లజనులు
గోడుగోడు మంటుంటే
కోట్లధనం ఆయుధాల
కొఱకు ఖర్చు చేసేరు.
ఒకని చూచి ఒకడు జంకు,
ఒకని శత్రు వొకని దోస్తు,
నేటి నిజం రేపు బొంకు
అన్నిట స్వార్థం మస్తు!
మనిషింకా అంధకార
మహాజలధి నున్నాడు
అందుకే నిశాచరుల
ఆటను కట్టించలేడు.
ఇంకుతున్న మానవుడా!
ఇకనైన మేల్కాంచు!
తుపాకీల హతంచేసి
కృపాకీల వెలిగించు!
ధాన్యం తరిగే వేళ
సైన్యం పెరిగే నేల?
సైనికుడే సైరికుడై
సాగుచేయవలె నేల!
తిమిరంతో ఘన సమరం
జరిపిన బ్రతుకే అమరం
కవితా తేజోవలయం—
అవని శాంతి కది నిలయం.

*

## కోఽహం?

సముద్రం నాతో సాయంత్రాలు
వాదిస్తుంది
నామీద తన ముద్ర వేయాలని చూస్తుంది

కాసేపు తన ఉవ్వెత్తు కెరటాలతో
జడిపిస్తుంది
కొంతసేపు తన నవ్వుల నురుగులతో-
లాలిస్తుంది
నేను-కదలని కరకు రాతికొండలా
ఎవరినైనా యెదిరించే గుండెలా
దాని అరుపులను, పెడబొబ్బలను
పెడచెవిని బెట్టి
నా నిశ్శబ్దంతో భీకరశబ్దాన్ని ఓడిస్తూ
దాని కళ్ళలో కాళ్లాడిస్తూ
ఆకాశంతో చేతులుజోడిస్తూ
కూచుంటాను
అహోరాత్రాలు ఘోషించే పయోరాశికి
నా చిన్నిశబ్దమంటే
ఎక్కడలేని భయం!
అక్కడే నాకు జయం
భూమిని నమిలేయాలని
బుసలుకొట్టే కెరటం
నాగసర్పంలా నాకై
నాల్కలుసాచే కెరటం
వెనక్కి వెళుతుంది మరుక్షణం.
కలదని మెదలని భూమి,
కోవెలలో మూలస్వామి!
నేను భూమిలా జీవించాలని
నానా బాధలూ పడతాను
కాని నా హృదయం సాగరమై
నాలో పొంగి పొరలుతుంది
నాలోని రత్నాకరాన్ని దాచాలని
నానా యాతనా పడతాను నేను
పైకి ధరణిలా కనపడతాను
లోన జలధిలా పరిగెడతాను
నాకు ఇష్టంలేని పనే చేస్తాను
నాకు కావలసినవి పొందలేకపోతాను
నేను గన్ను చేపట్టాలనుకుంటాను
కాని పెన్నుతో కలలు కంటాను
నేను నమ్మిన సిద్ధాంతాలు వమ్మైపోతుంటే
నేను నాటిన మల్లెతీగ నన్నే కాటేస్తుంటే
నేను కట్టిన ఆశాసౌధం
నిలువునా కూలిపోతుంటే
నేను ఊహించిన భవిష్యద్దేవత
వర్తమాన రాక్షసిగా అవతరిస్తుంటే
నిట్టూర్చుతూ, నన్ను నేను
నిందించుకుంటున్నాను.
కాలం రాల్చిన పండుటాకుల్ని
వసంతకాలపు జ్ఞాపకంగా
జేబులోపెట్టుకు తిరుగుతున్నాను
అయినా నా నరాల్లో అగ్ని చల్లారలేదు
వంచన అనే మంచులో-
కుంచుకుపోతున్న నాలో
త్రేతాగ్ని జ్వలిస్తోంది
చైతన్యాన్ని వరిస్తోంది
అందుకే నేను నేనుగా వున్నాను
ఇంతకీ యెవరు నేను?
అవని అసువుల నొసగే
అతడే అతడే నేను
కోఽహం? సోఽహం!

**

## డా॥ సి. నారాయణ రెడ్డి

### ఉదయం నా హృదయం

నా పేరు కవి
ఇంటిపేరు చైతన్యం
ఊరు సహజీవనం
తీరు సమభావం
నా వచనం బహువచనం
నా వాదం సామ్యవేదం
కవిత్వం నా మాతృభాష
ఇతివృత్తం మానవత్వం.

అక్షరాలు ఆశయాలు
జీవితాలు సన్నివేశాలు
ఛందం హృదయ స్పందం
ధ్యేయం బహుజనానందం
పతాక స్థాయి ప్రతిఘటనం
భరత వాక్యం పరివర్తనం.

తెలుగు కళ్లకు తెలుసు
నా లలితకళా రూపం.
తెలుగిళ్లకు తెలుసు నా కలగీతికాదీపం.
పల్లెలకు తెలుసు నా పాటల కలిమి.
పురాలకు తెలుసు నా స్వరాల కలిమి.
భద్రాచలం ఎండలకు తెలుసు
నా పచ్చి వేడి.
హార్స్లీ కొండలకు తెలుసు నా పిచ్చి చలవ
కృష్ణవేణి కెరుక నా మహోద్ధతి.
మంజీర కెరుక నా మౌనగతి.

యాదగిరి కెప్పుడూ నా యాదే
సింహాద్రి గురి నా మీదే.
ముక్కోటి గుండెలను
ముడివేసే సూత్రాన్ని.
ముల్లోకాలను వడబోసే నేత్రాన్ని.

సంప్రదాయాన్ని జీర్ణించుకున్న
ప్రయోగాన్ని.
ప్రయోగంలో జీవించుతున్న
సంప్రదాయాన్ని.
అందరిలాగే సామాన్యుణ్ణి
అయినా చిరంజీవుణ్ణి.
నిన్నటి భవితవ్యాన్ని
రేపటి వర్తమానాన్ని.

మృత్యువు నా బద్ధశత్రువు
బ్రతుకు నా ఆత్మబంధువు.
ఇనబింబం నా శిరస్సు
ఇందు బింబం నా మనస్సు.
తేజస్సు నా తపస్సు
ఓజస్సు నా ధనుస్సు.

నా క్రోధం జ్వాలాముఖి
నా శాంతం బడబాశిఖి.
గగనం నా వదనం
ఉదయం నా హృదయం
తూర్పు నా ఊర్పు
మార్పు నా తీర్పు.

*

## దీపం ముట్టిస్తున్నావా పాపా !

దీపం ముట్టిస్తున్నావా పాపా !
పాపచ్ఛాయలు సోకని పాలవ్రేళ్ళతో దీపం ముట్టిస్తున్నావా పాపా !
ముట్టించు; నీవైనా ముట్టించు
మట్టిదీపమైనా సరే మనసారా ముట్టించు.

చిట్టెంకట్టిన చీకటిగుట్టల్ని చీల్చలేక
మా వజ్రాయుధాలు జావగారుతున్నాయి.
మర్రిఊడల్లా దిగిన నిరాశల్ని తెంచలేక
మా సంకల్పాల గొడ్డళ్ళు మన్నుగరుస్తున్నాయి.
నిటారుగా నడవాలనుకున్న మాకు నిట్టూర్పులే ఊతకర్రలైనాయి.
నిండు వెలుగులు కోరుకున్న మాకు నీడలే చేతి కందుతున్నాయి.
ఇంక మేము దీపాలు ముట్టించలేము.
చల్లారిపోయిన మా ఆశయ గర్భాల్లో
జ్వాలాముఖిని దట్టించలేము.

మంచిని వెలిగించలేని భీరువులం మేము.
మయసభలో జారిపడ్డ కౌరవులం మేము.
గాజుపెంకుల్లా వెలుగుతున్న కళ్ళు మావి.
కాకిబంగారంలా మెరుస్తున్న వాకిళ్ళు మావి.
ఆ వాకిళ్ళలాంటివే మా అంతరంగాలు.
అవి రంగురంగుల చీకట్లకు నాట్యరంగాలు.

ఇరులతో చేయికలుపుతున్న మేము ఎలా దివ్వెలు వెలిగించగలం ?
ఇరుకులోయల్లో తలదాచుకున్న మేము
ఎలా నవ్వులు పండించగలం ?

ముట్టించు పాపా ! దీపం ముట్టించు.
ముసురుకున్న మా తమస్సును
నీవైనా తుదముట్టించు.

*

## మంటలూ; మానవుడూ

పట్టపగలు నిట్టనిలువునా
ప్రజ్వలించే మంటలు.
ఉక్కు కట్టడాలనుంచి
సిమెంటు శిఖరాలనుంచి
ఖిల్లాలనుంచి, 'విల్లా'ల నుంచి
పగలబడి నవ్వుతున్న
ఫణసహస్రం విప్పుతున్న
పచ్చిమంటలు, పచ్చనిమంటలు.

పాలకవర్గం బెదురుతున్నది
కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నది
టెలిఫోన్లు విలపిస్తున్నాయి
ఫైరింజన్లు గావుకేకలు పెడుతూ
పరుగుతీస్తున్నాయి
తోకలు రిక్కించి ఘీంకరిస్తున్నాయి
తొండాలతో నీళ్ళు పుక్కిలిస్తున్నాయి.

మంటలు చల్లారడం లేదు
మస్తకాల్లో మస్తిష్కాల్లో, కళ్ళలో
కాళ్ళల్లో, కట్టుకున్న అంతస్తులో,
చుట్టుకున్న దుస్తుల్లో
వెర్రిమంటలు, ఎర్రని మంటలు
ఎంతకూ చల్లారడం లేదు.
ఎవరి కేమీ అంతుపట్టడం లేదు.

బుర్రల బీళ్ళు దున్నే చేతివేళ్ళు
భూమి వీపుగోకే కాలి వేళ్ళు
క్షణాలను పెనవేసిన నిట్టూర్పులు
నిముషాలను తగలేసిన సిగరెట్టులు
పాతాళగుహలో చేరుకున్నై
పరస్పరం సంప్రతించుకున్నై.
గది నిండా ఆవులించింది పొగ
అర్ధాటున జూలు దులిపింది ధగా,

"మంటలార్పడానికి ఒకే ఒక్క మందు
విద్యుత్ప్రసారం ఎకాయెకి బందు"-
మంత్రాంగం విజృంభించింది
యంత్రాంగం స్తంభించింది
ఇళ్ళూ వాకిళ్ళూ చల్లబడ్డాయి
కళ్ళూ కాళ్ళూ చతికిలబడ్డాయి
సత్తువ గుడ్లు తేలవేసింది
నెత్తురు ప్రవహించడం మానేసింది
నగరాల నోటినిండా నురుగులు
నాగరికత ఒంటినిండా చెమటలు
వేడి చల్లబడింది, నాడి చప్పబడింది
వేగం చచ్చిపోయింది,
వెలుగు రిచ్చవోయింది
మంటలు కుప్పకూలినై,
గుప్పున చల్లారినై
మంటలు చల్లారినైగాని
మనిషి చల్లారలేదు.
మార్తాండబింబంవంటి,
మహోద్యమంవంటి
మనీషి మనస్వి మనిషి చల్లారలేదు-
మార్కండేయుని లాంటి, మారుతిలాంటి
మహోజ్వల భావి చిరంజీవి
మానవుడు చల్లారలేదు.

*

## మధ్యతరగతి మందహాసం

ఛందస్సులేని మాతృభాషలో
మందహాసం చేస్తున్నాను
మందహాసానికి ఛందస్సుంటుందని
మరువలేకపోతున్నాను.
సముద్రగర్భంలో కూచొని
సరిగమ లేరుకుంటున్నాను.
సమాజహృదయంలో దాక్కొని
ఢమరుధ్వని వింటున్నాను.

పాలనురుగుల్లాంటి శరన్మేఘాల
నీలిరంగు గమనిస్తున్నాను.
గడ్డిపెరుగులాంటి శరచ్చంద్రికల
జిడ్డును చూసి నిట్టూరుస్తున్నాను.
ప్లాస్టిక్ పువ్వుల్లో దాగిన
సృష్టిరహస్యాలు పరికిస్తున్నాను
నైలాన్ బతుకుల్లో మూగిన
జాలిగాథలు వడబోస్తున్నాను.
పెరిగిపోతున్న ధరల్ని చూసి
పెదవి విరవడం మానుకున్నాను
కడివెడన్ని కలల్ని తాగేసి
కడుపునింపడం నేర్చుకున్నాను.
ఒక్క గుండె రెండుగా చీలిననాడు
రెక్కతెగిన పక్షిలా వున్నాను.
చీలిన గుండె వేయి పేలికలా నేడు
చిచ్చుమింగుతూ కూచున్నాను.
చిచ్చుమింగిన శివుని వారసుల్లో
చివరివాణ్ణిగా వున్నాను.
తండ్రి తాతల కీర్తిపరంపరలో
తామ్రశాసనంలా మిగిలాను.
నవ్వుతున్న జీవచ్ఛవానికి
రవ్వలహారంలా ఉన్నాను.
మధ్యతరగతి మనస్తత్వానికి
మాయని గాయంలా వున్నాను.
వంచననుంచి మంచిని వేరుచేసే
అంచ ముక్కును వెతుకుతున్నాను.
ఎగిరి తన్నే చట్టాలపొదుగు దువ్వి
చిగురుపాలు పితుకుతున్నాను.
నిట్టూర్పుల వంతెనమీదుగా
నిజాయితీని చేరుకుంటాను.
నిరాశల ఊడల్ని పట్టుకొని
నింగి అంచుల్ని అందుకుంటాను.
విల్లులా వంగిన వెన్నుపూసతోనే
విజయదశమి జరుపుకుంటాను.
కొడిగట్టిన ఆశయాలతోనే
కోటి దివ్వెలు వెలిగించుకుంటాను.

*

## నేనూ-నాతమ్ముడూ

తమ్ముడు పలికే పటికి నిజం
ధమ్మిల్లాలకు అమ్ముడువోని నీరజం.
వాడిగొంతు చిమ్ముతున్న కటిక చేదు
నేడో రేపో తీపి నిజం కాకపోదు.

తొలిచూలున పుట్టిన సత్యాన్ని నేను
తురాయి అంచులు ముట్టిన
ముత్యాన్ని నేను.
వాడేమో వట్టి కడగొట్టు బిడ్డ
వన్నెచిన్నెలు నోచుకోని మట్టిబెడ్డ.

వాడు పుట్టాడు కత్తి కుత్తుకతో
వాడు పెరిగాడు కరకు మృత్తికతో
లోకం గుట్టు వాడికి తెలిసినట్టు
నాకు తెలియదు నమ్మండి ఒట్టు.
ఆలోచనా, ఆలాపనా నాది
ఆక్రోశం ఉక్రోశం వాడిది
కాలభుజంగం కాటు తిన్నవాడు
కసి పెంచుకోక ఏం చేస్తాడు.
గిరులు గీసుకోవద్దన్నాను నేను
గిరులు పిలిచాయన్నాడు వాడు
మనుషులమీద నమ్మకం పోయినవాడు
మట్టినీ గుట్టనీ పట్టక ఏంచేస్తాడు.
తమ్ముని గొంతుకతో శ్రుతి కలపలేకున్నా
దమ్మును మాత్రం మెచ్చుకుంటున్నాను.
రాజీ పడే అవసరం ఇద్దరికీ లేదు
రస్తాలు వేరని చాటుతున్నాను.

**

# పఠాభి

## ఆత్మకథ

ఎవర్నని యనుకొంటిరో మీరు నన్ను ?
ఏను పఠాభిని......
కాంగ్రేసు రాష్ట్రపతి స్థానాని కోసం బాబూ సుభాసుబోసుతో పోటీజేసి
ఓడిపోయిన డాక్టర్ పట్టాభిని గాన్నేను, మరో పఠాభిని;
అయితే అతగాడికున్నంత ఉపజ్ఞ నాకున్ లేదని తలంపకండీ,
గాంధీటోపీ జవ్వారుజాకట్ మీసాలు లేకున్నంత మాత్రాన !
పయిజమ్మాలు వేస్తాను కాబట్టి
నన్ను మీరు షోదా యని సోషలిష్టని
తిట్టబోకండి, ప్రఖ్యాతంగా నున్న
కవిన్నేను;
నాకు విచిత్రంబగు భావాలు కలవు
నా కన్నులందున టెలిస్కోపులు
మయిక్రాస్కోపులున్నవి.
ఈ వచనపద్యాలనే దుడ్డుకర్రల్తో
పద్యాల నడుముల్ విరుగదంతాను;
చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని
చాల దండిస్తాను;
ఇంగ్లీషు భాషాభాండారంలో నుండి
బందిపోటుంజేసి కావాల్సిన మాటల్ను దోస్తాను.
నా యిష్టంవచ్చినట్లు జేస్తాను
అనుసరిస్తాను నవీనపంథా; కానీ
భావకవిన్మాత్రము కాన్నే, నే
నహంభావకవిని.



## పోలీసు

చీలుదారుల్లోన నిల్చొనున్నాడు
పోలీసుభటుడు.
ఖాకీ దిర్సుం ధరించి తలమీద
కుసుంబాకుళ్ళాయి గల్గి
మహాచోద్యమ్ముగా!
భరతనాట్యం బాడుచున్న
ప్రశాంత ప్రకాశ ముఖంబుతోడి
నటర్షి చూడామణిలాగ
కన్పిస్తున్నాడు,
ద్రయివర్లందరి కళ్ళచేతన్
పూజింపబడి గవురవింపబడి!
వాడుం జూపించు నిష్కర్షయగు
తన చేతి ఓ ముద్ర చాలును
రహదారి ట్రాఫిక్కంతా నిల్చిపోవంగ
అతగాడి బహిరంగ ప్రదర్శనమ్ము
చేతన్ స్థంభీభూతం బయిన
జగజ్జంగమ ప్రకృతి మోస్తరు;
ఓ ఓ సారి తన
భ్రూవిక్షేపము చేతనే బండ్లన్
బలవంతంగా నడుపగల, మహా
సామర్థ్యంబున్న దతడికి
నటరాట్టులాగా నతండు కూడ
మృత్యుంజయ నృత్యంబును
సల్పుచుంటాడు సతతము—
బల్బు హారన్ల తాళాం తోడి
ఎలక్ట్రిక్కు హారన్ల రాగానికిన్ని
మోటారు సయికిళ్ళ మృదంగానికినీ
అనుగుణ్యంగా నర్తిస్తుంటాడు
తటాల్మని ఇటూ అటు తిరుగుచు
హస్తాల నందమ్ముగ త్రిప్పుచు
ఏ మా యపూర్వదృశ్యం!
మండుచున్నట్టి మాడుచున్నట్టి
మే మాస మధ్యాహ్న కాలమందేని.
బానల్తోడ పోసినట్లుంగురి సేటి
భాద్రపద మాస వాన యందేని,
తన నిర్ణీత ప్రదేశంబునుండి
ఓ యంగుళమ్ము గూడా జరుగడు!
ఏ ప్రచండాతి ప్రచండ ఘోరాతిఘోర
తీవ్రాతితీవ్ర తపస్సుం
జేయుచున్నాడో నిష్ఠతోడన్?
చరాచరములన్ తారుమారు చేయగల
మహాశక్తి సంపన్నుండగు యోగి
కాడా ఈ పోలీసుభటుడు?
ఈ మహానటుడు?
అవు నీతనికి పవరున్నది కడు
చీలుదారుల్లో నిల్చొనియున్న
పోలీసు భటుణ్ణి చాలా నేను
స్తుతి చేస్తాను. బలే గౌరవిస్తాను
యింకా ముగ్ధుండ నయిపోతాను కూడ
వాని భరతనాట్యంబును చూచ్చాడ. *

## వసంతం

వసంతర్తువు వచ్చిందని నేను
విన్నా నీ మద్రాస్సిటీలోకి—
ఏదీ వసంతం?
కోకిలారావం బేదీ వినబడలేదే నాకు,
విధీ విరామంలేని
బస్సుట్రాముల గోల తప్ప;
నిజంగా వసంతకాలం వచ్చిందా?
అదో చూడుము!
కన్నులుగుట్టునట్టి అక్కరమ్ములతోడన్
చల్లారాముగ్ని షాపుముందు
"వసంతకాలపు టఖండ అమ్మకా"లని
"ఖరీదుల ఫనాఫనా" అని
"కిమ్మత్తుల నరకు,"డనీ

ఏలా అడ్వర్టయిజు చేయంబడి యుందో!
తప్పకుండా వసంతకాలం
వచ్చియుండాల—
అదీగాక నేటి పత్రికలోన
ప్రచురింపబడ్డ పండితోత్తముని పద్యాలు
చదివానా ఋతురాజునుగూర్చి ?
"తాలాశ్వత్థ హింతాల నారికేళన్యగ్రోధ
జంబీర పున్నాగ పలాశరసాల
సాలాది వృక్షాలు
చిగిర్చినా" యంట
నవ్వుస్తున్నది నా కీ పండితుడు
అమరమ్ములోని వనౌషధి వర్గాన్నంతా
— ఒక వృక్షాన్ని కూడా స్వయంగా
చూచిన పాపానపోడు—
గుప్పించి విడిచినందులకు !
అదిగో చూడుము! స్త్రీలు
తలలందు కుప్పలుక్కుప్పల పూలగల్గి
చీరల్నిండా మహావృక్షజాతులను
అద్దించుక
వికసిత లతాకుంజాల్లాగ కన్పిస్తు
మద్రాసు నగరలక్ష్మికి నిజంగా
వసంతం వచ్చినట్టుల
నిరూపిస్తున్నారు !
సఖా ! నీవేమాత్రం జంకకుండా స్త్రీల్
తమ వేనళ్ళలో నలంకరించుకున్న
ఆ పుష్పాల నాఘ్రాణింపుము
తప్పేమున్నది ?
యిందుక్కాకున్న మరేల వాళ్లు
తమ కన్నులకు కన్పింపకుండ
ముక్కుకు చాల దూరంలో
తురుముకొన్నారు పూలను ?

వసంతకాలము మద్రాసులోకిన్
వచ్చింది కాబట్టి
సాహసించి ఆఘ్రాణించుము, మిత్రా !
సాహసం లేనిదే సౌఖ్యమ్మంత
సులభమ్ముగా రా దీ రోజుల్లోన.
అదీగాక, స్త్రీ చిత్తంకూడా సరళంగ
వుంటుందిగదా వసంతం వచ్చింది కాన. *

## నటరాట్టు

ఎగురగొట్టబడి
విడిన జుట్టుముడి
నల్లగట్టులాగు గనబట్టు
గిరుల నట్టనడి
దుముకునట్టి వడి
గలిగి అట్టహాస్య నది పుట్టు
రగులు నాట్యమాడ నటరాట్టు

ఉడుకు నాలికల, ఉరుకు పోలికల
కనలు నట్టి కోరికల జట్టు
పయికి లేచి కడు
పువులు పూచి పడు
అతడి పట్టుపాదముల చుట్టు
మిగుల నాట్యమాడ నటరాట్టు

అపుడు లోకముల
సుఖము శోకముల
ఇనుప పట్టకారులవి పట్టు
తిరిగి బాష్పములు
తిరిగి పుష్పములు
అతడి మట్టుక్రింద తుదముట్టు
రగులు నాట్యమాడ నటరాట్టు.

## ఫిడేలు రాగం

ఫిడేలురాగమ్ ఫిడేలురాగమ్
ఫిడేలురాగమ్ములు
వినూతన పదప్రేమికులు, మహా కాముకులు;
అన్యోన్యమగు దమ్పతులుకూడ:—
ఫిడేలన్నది, "మ్ఢియరాగ్రా !
మీ వారన్దరు సనాతనాచార్యుల్
ముఖమ్విరిచి, ఇన్గ్లీష్దానిని
నన్ను న్జేపట్టవద్దని
గద్దిన్చినా కూడ నీవు
మహా సాహసన్తో, రుమాన్టిక్గా
మ్యారేజ్జేసుకొన్నావుగదా ! స్వీట్హార్ట్ !"
రాగమ్ అనినాడు.
"థ్యాన్క్స్ టు పఠాభి నా కతడు ధ్రైయిన్గా
సహాయ్యమ్జేయపట్టి మనకు
వివాహమయిన్ది డార్లిన్గ్ !"
ఫిడేలు రాగమ్ములు ఆదర్శమగు దమ్పతులు
తటాల్మని కలకన్ఠమున, ఫిడీలీలా
ప్రశ్నిన్చినది, "రాగాడియర్నన్ను
నిజన్గా ప్రేమిస్తావా నీవు ?
ఏమ్మాటన్టున్నావు ఫిడేలీ జీవితేశ్వరీ !
నా జన్మ నీలో లీనమయి పోయిన్ది.
సన్ఘమ్నన్వినాగూడ నిన్ను చేపట్టినన్దుక్నాకు, వచిమ్పరాని
సవుఖ్యమ్." ఫిడేలు చిత్తతన్త్రులు
ఆనందంతో మ్రోగినవి.
రాగమ్ అంత ఫిడీలీని గాఢమ్గా కవ్గలించాడు; తర్వాత వారి
దేహాలు న్నేకమయినాయి సరళశయ్యన్.
అపూర్వమ్బగు అన్దంబగు సన్తానమ్ వారికి
జనిన్చిన్ది అసన్ఖ్యాకముగ :—వారన్తా
పఠాభిని గని "తాతా తాతా" అనేవారు.

**

# బోయి భీమన్న

## కవితవల్ల ప్రయోజనం

మనిషికి చదువు అవసరమా ?
సుఖంగా బ్రతకడానికి
చదువక్కరలేదు.

ఇదిగో, ఈ మేడ ఎవరిది ?
అదిగో, ఆ కోట ఎవరిది ?
ఈ సిటీలోని ఆస్తిపరులలో
ఎవరిపనిని వారు చేసుకుంటూ
స్వతంత్రంగా జీవిస్తున్నవారిలో
చదువుకున్న వాళ్ళెంతమంది ?

సుఖంగా బ్రతకడానికి
చదువే అక్కరలేదు,
సాహిత్యందాకా ఎందుకు ?

ఉజ్జ్వలంగా బ్రతకడానికి
విద్య అవసరం—
యూనివర్సిటీవిద్య కావచ్చు,
ఇంద్రజాలవిద్య కావచ్చు !

ఆనందంగా బ్రతకాలను కొన్నప్పుడే
అవసరమవుతుంది సాహిత్యం !
సాహిత్యంలో కవిత
సౌహిత్యంలో అమృతం !

కవిత ఒక భోగవస్తువు,
అది ఎవరో ఒక కొందరికే ?

జనానికి కావలసింది
చవుక బియ్యపుదుకాణం,
రత్నాల షాపుకాదు !
జనాభ్యుదయానికి కావలసినవాడు
రాజకీయ విప్లవకారుడు,
కవికాదు.

రామాయణం చదవడం
రాముడిలా ఎదగడానికికాదు,
హరిశ్చంద్ర నాటకం చూడడం
సత్యం పలకడం నేర్చుకోవడానికికాదు,
సర్కసు చూడడం సరదాకు
లా చదవడం బ్రతుకుతెరువుకు.

బుద్ధుడు, క్రైస్తు, మార్క్స్, మహాత్ముడు,
అంబేడ్కరు వంటి మానవోద్ధారకులలో
ఒక్కడూ కవికాదు.

రచనను విప్లవవ్యూహరచనగా
విన్యసింప జేసేవాడు
రాధా మనోరథుడైనా
రాజకీయ రథసారథుడే !

కవిత ఒక అద్వితీయమైన అమృతం !
కవి తానే మంధరమూ, వాసుకీ అయి
దైత్యులూ, ఆదిత్యులూ తానే అయి
తానేపాల్కడలీ, మహాకూర్మమూ అయి
చుట్టుముట్టే విషాన్నితానే
కంఠగతం చేసుకొని
అమృతాన్ని సృష్టించి, అరచేతిలో
పెట్టుకొని
ధన్వంతరిగా తానే అవతరిస్తాడు
గుండె గుండెనూ తడతాడు.

ప్రతి సరసుడికీ పంచుతాడు !
బిచ్చగాడైన దాత, భక్తుడైన భగవంతుడు
ఎవడైనా వుంటే – అతడే కవి !

అయితే—
దాతవల్ల ఏమిటి ప్రయోజనం ?
మన అన్నదాన సిద్ధాంతం
ఆకలితీర్చగలిగిందా కోటికొకరికైనా ?
భగవంతుడివల్ల ఏమిటిలాభం ?
మన భక్తవత్సల విశ్వాసం
రక్షించగలిగిందా దేశాన్నిదాస్యంనుంచి ?

ఎవడి దయాధర్మభిక్షావద్దు !
నీకు ఉప్పు, పప్పు, బియ్యం కావలిస్తే,
సూపరుబజారుకు వెళ్ళు !
ఉద్యోగం, ప్రమోషను,
పర్మిట్టు కావలిస్తే
అయ్యగారి కిచను గార్డెనుకు వెళ్ళు !
సర్వంపోయినా చవకడబ్బు
కావాలనుకొంటే
రేసులు, లాటరీలు, బ్రాకెట్లు
చాలవున్నై !
ఏ వృత్తికీ, ఉద్యోగానికీ
పనికిరాకపోతే
రాజకీయమో, సాంఘిక సేవోలేదా ?
తృప్తిగాతిని, తాగి,
ఆనందించా లనుకొంటేనే
ఇటు నావద్దకు రా !
ఇదిగో, కవిత !

*

## చీమల పుట్టలు

నల్లచీమలు, తెల్లచీమలు
ఎర్రచీమలు, పచ్చచీమలు
చలిచీమలు, పులిచీమలు
కండచీమలు, రెక్కలచీమలు
అబ్బో, ఎన్నెన్నిరకాలచీమలు !
ఎన్నెన్ని రంగులచీమలు !

ఒకోరంగు చీమలకు ఒకోపుట్ట
ఏ రకంచీమలకైనా ఉండే దొకే పొట్ట
ఏ పొట్ట నిండడానికైనా
కావలసింది ఇన్నిగింజలు
గింజలకోసం గింజుకు
చస్తున్నై లంజలు !

నల్లచీమనోట్లోని బియ్యపుగింజను
తెల్లచీమ లాక్కుంటున్నది
తెల్లచీమ పుక్కిట్లోని కాకితం ముక్కను
కండచీమ పీక్కొంటున్నది
నేలనిండా ఆహారంవున్నా—
అది తింటున్న లవమే
ఇదీ కావాలంటున్నది !

చీమకొంచెం సైజు మారితే, అదొకజాతి-
కొంచెం రంగుమారితే, అది మరొకజాతి!
దేశకాలాలను బట్టి పాత్రల గుణవర్తనలు
మారుతూవుంటై అని ఎరగనిచీడలు !
తక్కిన అన్నిజాతుల మీదా
తనజాతే గొప్పదనుకునే పీడలు !

జాతికోపుట్ట
ఎన్నోపుట్టలు !
పుట్టకూ పుట్టకూ మధ్య
పొట్టకూటికి పోరాటాలు !
తెలివితక్కువ చీమలు
గింజలకోసం గింజుకు చస్తుంటై
అవిపెట్టిన పుట్టలు పాములకిరవవుతుంటై!

ఇప్పుడు ఏపుట్టలో చూచినా
వాటినిండా పాములే !

కనీసం సుమతీశతకమైనా
చదువుకోని చీమలు
కలిసి చలిచీమలెలా అవుతై ?
ఆ పాముల పడగల నీడల్లో ఒదిగి
కప్పల్లా బ్రతుకుతున్నై !

అయ్యో, పాపం, చీమలు
రంగులే రాజ్యాలను కొంటూ
హంగుల్ని పోగొట్టుకున్న చీమలు !

స్వపరాలు లేని చెట్టుచేమలు—
దూరభారాలు లేని దోమలుకూడ
తమకంటే తెలివైనవని
తెలియలేని చీమలు !
తమలో తాము కొట్టుకుచస్తూ
తమపుట్టల్ని
పాములకు కట్టబెడుతున్న చీమలు !

*

## జీవన మరందపం

ప్రభాతంలో
పద్మాంగనా పరిష్వంగం నుంచి
విమోచన లభించిందినాకు.

నవసంధ్యారాగంలో స్నానంచేసి
లోకబాంధవునికి వందనంచేసి
బైలుదేరాను పనిలోకి నేను

పగలంతా గడిచిపోయింది
పరమేశ్వరుని కృపామధూళిని
ప్రతిపువ్వుకూ పంచిపెట్టడంలో

స్వాంతం సంతృప్తి పడింది
ఆత్మ ఆనంద పరిప్లావిత మయింది
శరీరం అలసింది,
మనస్సుమాత్రం రెక్కల సువాసన
అల్లార్చింది

మరో మజిలీకోసం
మరింకేదో మహానుభూతికోసం !

సాయం సంధ్యారాగ సరోవరంలో
స్నానానికి సిద్ధమైన నాకు
లోతెంతో ఎందుకుయోచన ?
చిమ్మచీకటికంటె
చిక్కని మైమరపు కోరుతున్ననాకు,
రేయి అమావాస్యో,
పూర్ణిమో ఎందుకుచింత ?
మళ్ళీ ఏ జలజాంగనా పరిరంభంలోనో
చిక్కుకునే వీలున్ననాకు
ఆనందం కాక
ఎందుకు ఆరాటం ?

*

## ఎక్కడికి పోతున్నారు

ఎక్కడికి పోతున్నారు వీళ్ళు ?
పూర్వం గుడికిపోయేవాళ్ళు
ఆ మధ్య బడికిపోయేవాళ్లు
ఇప్పుడెక్కడికి పోతున్నారు వీళ్లు ?

ఎక్కడికో పోతున్నారు—
మరేం చేస్తారు ?
గ్రామదేవతలనుంచి బాబాలదాకా
చిత్తం పూజలమీద - ప్రజలమీద కాదు!
టీచర్లనుంచి ప్రొఫెసర్లదాకా
దృష్టి జీతంమీద - చేతంమీద కాదు !

మరి - తల్లిదండ్రులు లేరా అంటే-
ఉన్నాలేనట్టే,
వాళ్ళ ఇరవైనాలుగు గంటలూ
వృత్తి ఉద్యోగసేవలకే చాలవు.

ఇక ఏంచేస్తారు ఈ పసివాళ్లు ?
ఎక్కడికో పోతున్నారు, పాపం !

పూలనూ, పండ్లనూ విసిరేసి
పుస్తకాలనూ, ముద్దుమురిపాలనూ చించేసి
గతం తెలియక, భవిష్యత్తు కనిపించక
వర్తమానం బొమ్మని
పొగపెడుతుండగా—

పాపం - ఏం చేస్తారు ?
గుండెలను బండలు చేసుకొంటూ
ఆ రాళ్ళతో జేబులునింపుకొంటూ
వాటిని ఇటూ, అటూ—దారిపొడుడునా
కనిపించనిదానికేసెల్లా విసిరికొడుతూ
నిరాశతో, కోపంతో, పిచ్చిగా
పోతున్నారెక్కడికో !

మంచి, చెడ్డ తెలియని అమాయకులు !

లక్షణమైన శిక్షణకు నోచుకోని
అనిరుద్ధులు !

**

# బైరాగి

## మేలుకొన్నవాడు

నడిరేతిరిని మేలుకొన్న వాడెవ్వడు ?
దివ్వెల నమ్మిక లేమి, నీడలకుట్ర,
చీకటుల మెతకబుద్ధి, ఎవ్వరికెరుక ?
గోరీలా అలికిడి లేని గదిలోపల
ఎందుకు పడినట్లా వెలుగు మరక ?
గచ్చుమీద విచారాల పచారుల వల;
చిక్కిన పిట్ట ఎగురలేని గడ్డిపరక.
ఎవ్వరి కరమౌతుందన్న ?
తెల్లవారి మరొక ప్రొద్దు, ఏముంటుంది అంతకన్న ?
గాలి కబురులు విన్నవారు ఇట్టే ఎందుకు నవ్వరు ?
చీకటుల సముద్రంలో జాగారపు చిల్లుపడవ,
సోపానాలు లేని ఉదయ శైలారోహణలో శ్రమ,
ఇల పేరుకొనేందుకు చిరువెలుగుల పీలికల నడవ,
ప్రతి నిముషం ఎవరో తలుపు తడుతున్నారని భ్రమ.
శూన్యమేధాగృహం మధ్య పిరికితలపుల ఎలుకల పరుగు.
కుక్కల మొరుగు కేకలిడే మేనపుదుప్పటి చిరుగు.
ఎవ్వరి కర్థమౌతుందన్న, మేలుకొన్న వారికన్న ?
నడిరేతిరి తోడెరుగరు, జాగారం జోడెరుగదు,
ఉన్నారెంతోమంది, నిదురిస్తున్నారంతా,
ధన్యులు వారు, వారెరుగరు ఏ చింతా.

వారికే దీర్ఘయామిని ఒక నిద్రా మధురక్షణం,
ఈ తమసా సంకటయాత్ర వారి నల్లకలువల తూగుటూయల
రెప్పల మొగముల్ మడుగులొత్తిన పథకపు విహరణం, కాలహరణం
వారి జగతి వైతరిణి తటి కావల
కాని ఈ కూడని వేళ యీ మేలుకో జేసేది,
నిర్భాగ్యుని రెప్పల జేబుల్నుంచి నిద్దురపర్సు కాజేసేది

ఆ మహత్తర ప్రేరణ ఏది?
అవమానం, అభిమానం, జ్ఞాపకాల కంటకాల ఉపధానం?

లజ్జాకర జీవితాల కలుష మలిన పరిధానం?
ఎవరైనా ఎందుకు మేలుకోవాలసలు ఈ నిశలో?
జగత్తంతా నిదురిస్తోంది
యానిశా సర్వభూతానాం, తస్యాంజాగర్తి సంయతి,
ఒకే ఒక్క తెల్లని చుక్క ఈ మసిలో
ఎవరు కోరరు నిద్రా నీల మానసంలో స్వప్ననౌకల అభియానం?
తరంగాల కోమల పర్యంకంపై శ్వాసల పతనోత్థానం?

కాని ఇచట ఎవరో ఒకరు మేలుకొనక తప్పదుగదా?
అనాగతుడు అభ్యాగతుడై అడుగులసడి వినబడినపుడు,
తలుపెవ్వరు తెరుస్తారు? ఎవ్వరు పలుకరిస్తారు?
శాంతి ఉండబోదు సదా, తొలివెలుగుల తెలిరేకలు విడివడినపుడు
ఖండిత గీత గళమెత్తే చారణుడెవడు?
విచ్ఛిన్న నైశసైన్యపు ప్రాణావశిష్ట భటుడు,
అగ్రేసరుల ప్రథమదూత, అమిషాస్థుల పతనోన్ముఖ
సేతువుమీద ఉదర్కపు ఊహోద్ధటుడు
అపుడెవరు అడుగుతారు అతడెవడని
నడిరేతిరి మేలుకొన్న వాడెవడని?

## నాకొ్కంచెం నమ్మకమివ్వు!

నాకొ్కంచెం నమ్మకమివ్వు!
కొండలు పిండికొట్టేస్తాను
చితికిన టొమేటో లాంటి సూర్యుణ్ణి
ఆరిన అప్పడం లాంటి చంద్రుణ్ణి
ఆకాశపు ఎంగిలి పళ్ళెంలోంచి నెట్టేస్తాను
నాదగు బాహు బంధనంలో ఈ సువిశాల బ్రహ్మాండాన్ని
చాపలాగ చుట్టేస్తాను
నిస్సహాయ మానవేయుని నొసటిగ్రవాలు
ఒక్క కలంపోటుతోడ కొట్టేస్తాను
జీవిత సభాభవనం నుంచి
అన్యాయాన్ని దౌర్జన్యాన్ని మెడబట్టుక గెంటేస్తాను

ఇంకెన్నో ఎన్నెన్నో చేస్తాను, కాని ఒక్కటి—
నాకొ్కంచెం నమ్మకమివ్వు !

కాలుని మీద కలబడతాను
పరమశివుని శూలాగ్రాన తలక్రిందుగ నిలబడతాను
ఇంటింటా గగనకుసుమాలు మూడు పూవులుగ
నందన నికుంజాల్లోని అమృతఫలాలు ఆరుకాయలుగ
పూయిస్తాను, కాయిస్తాను
కొయ్యతుపాకి దొరనై పోయి
బావులు పూడ్పిస్తాను, చెరువులు త్రవ్విస్తాను
ఆకాశపు పందిరి క్రింద
నయాగరా నిర్ఝరాల చలివేంద్రాలు స్థాపిస్తాను
ప్రపంచమనే మహాసత్రం నిండిపోతే
మరోసత్రం కట్టిస్తాను
ఆకాశపు ఊదారంగు తాను చించి
చొక్కాల్లేని వారందరికీ కుట్టిస్తాను
ఒకటేమిటి ఏదైనా చేసేస్తాను
నాకొ్కంచెం నమ్మకమివ్వు !

నమ్మకంలేని బొందె ఖాళీ సిగరెట్టుటిన్ను
నమ్మకంలేని హృదయం పుల్లలులేని అగ్గిపెట్టె
నమ్మకంలేని బ్రతుకు కాలిన సిగరెట్టుబూది
అన్నీ ఉన్నప్పటికీ నమ్మక మొకటి లేనియెడల బ్రతుకు సున్న
నాకొ్కంచెం నమ్మకమివ్వు !
నమ్మకమివ్వు !
నమ్మకమివ్వు !

## క్రిస్మస్ గీతాలు

అవకాశం, ఆహ్లాదం, ఆలోకం
నెత్తుటి మడుగులపూచిన
తెల్లని తామరపూవై
క్రీస్తు వెలసినాడు మరల.
లోకమంత నిశ్శబ్ద

హింసా శర్వరిగతించి
స్వర్ణఘంటికల సురభిళ
నిస్వనగీతులు రుతించి
దేవ పుత్రకుని నుతించు
పథభ్రాంత పణ్యాంగన
దిక్కులేని కుష్ఠురోగి
చనిపోయిన లాజరస్సు
ఎందరెంద రున్నారో
అందరికీ అవకాశం
ఆనందం ఆలోకం
లోకమంత నిశ్శోకం
శాంతి, శాంతి భూతలిపై
శుభైషణలు జనావళికి.
ఈరోజు జనించాడు
రారాజు జనుల హృదులకు
నీరజనము లెచటోయి ?
శైశిర ప్రాతః పధాన
తుహిన స్నాతావనిపై
రవికిరణ లోకనముల
శతసహస్ర శక్రచాప
వితతుల గణిత మణిమయ
జ్యోతులుద్భవిల్లు నేడు
లోకమంత నిశ్శోకం
శాంతి, శాంతి భూతలిపై
శుభైషణలు జనావళికి.

## 2

యూదులకు కూడ శాంతి
ఆమిషాస్థిమయ గాత్రం
దీనం కరుణా పాత్రం,
వంచన తామస నైజం
అప్రవంచితం కాంతి.

పైలట్లకుకూడ శాంతి
క్షయ్యం మానవుని నియతి
కేవలాంధ కర్మనిరతి
బాలురమాయకులు వారు
సహజ సులభమే భ్రాంతి.

హంతకులకుకూడ శాంతి
హింసకు ప్రతికాదు హింస
ఆరని జ్వాలిక జిఘాంస
నృశంసులకు తగినశిక్ష
ప్రేమపాశముల శాంతి.
దుర్బలులకు కూడ శాంతి
మూడుమార్లు కోడికూత
అగ్నిపరీక్షలకు దూత
అడుగులు తడబడినవారి
దక్షమ జన విక్లాంతి.
సైతానుకుకూడ శాంతి

ఓడినదేవులు దైత్యులు
ఓడినఆర్యులు వ్రాత్యులు
ఘృణా ఘృణుల స్వర్ణలేఖ
కవలిదెల్ల విభ్రాంతి.
విష్టపత్రయాన శాంతి
ఈ నిముసం నవజననం
గతము తుడిచినది తుహినం
శ్రాంతపాంథ గమ్యం
కనుచూపు మేర విశ్రాంతి
శాంతి, శాంతి, శాంతి.

*

# శ్రీరంగం నారాయణబాబు

## కవీ !

మృత్యు వాసంగే
మాతృ కరమ్ముల
విధవ కాసుపు పెదిమల
వెలుగై వెలిగి
నలుపెక్కిందీ సంధ్య

ఖేదంరేపీ, రోదసినిండి
విశ్వగళమ్మున
హాలహలమైన
విస్తరిల్లినవి చీకటులు !

నల్లని త్రాచుకోరలు
తెల్లని మశూచికుండలు
గగనమ్మున తారలు !

*    *

జట్కాగుఱ్ఱం కాలంమెళ్ళో
గంటలురెండు మ్రోగినవి
చచ్చిన తల్లిశవం
మెళ్ళోగజ్జెల
పట్టెడతో
ఉల్లాసంగా ఆడుకునే
పసిపిల్లాడులా గాలి !

ఒళ్ళుతెలియని
పుళ్ళబాధతో
వెక్కివెక్కి ఏడ్చినది
చుక్కల యాకాశం !

సద్యోఫలితం
విద్యుద్దీపం
వెలుగున
గదిలో

ఖ్యాతిగడించే గీతం వ్రాసి
ప్రేయసి కంకిత
మీయాలంటూ
మూతి బిగించి
చేతులు నులుముతు
కూచున్నావ ! ! !

## దేశమాత

ఎండాకాలం ! ఎండాకాలం !
పగళ్ళు నెగళ్ళు మండే రోడ్డు
పన్నెండు గంటలు !

కాలం కాలిన
గుడ్డపీలికై
ధూళి రేగినది
విలయ వేళల
విహాయసాలు
విస్ఫులింగములు
వర్షించాయి !

గుప్పెడు అన్నం
గుక్కెడు నీళ్ళ
స్వాతివానకే
ముత్యపు చిప్పె

కరువే రూపం దాల్చి
కదుపే చెరువై ఏడ్చి
నెలత ఒకర్తుక
నిలబడ్డాది
భిక్షా పాత్రికతో !

రెండు కన్నులు
కాలిన బండి కమ్ములు
పట్టలేని కూర్మిని
పచ్చని సంపెగలడాసి
విగత ప్రాణులు
వాలిన తుమ్మెద బారులు
కాలిన మారుని తూపులు
కలికి చూపులు

అంటీ అంటని ఆమె శరీరపు
చాలీచాలని చీరను
తొంగి చూచే మానం
"ఉన్నాడా చిన్ని కృష్ణుడు ?
అనసూయేదీ ?
అరుంధతే" దని
ప్రశ్నించింది !

చచ్చిన బాలింతల
వెచ్చని చనుబాల తీపి
మచ్చరించు కంఠముతో
'ఆకలి ! దాహం !
అన్నం ! అన్నం !' అంటూ
అలమటించింది
అగ్నివీణయై ఆలాపించింది.
ఖణేలుమన్నవి కకుప్ప్రాంశికలు !

బలి ప్రముఖుల
పాతర మా భూమి
అతిథి పూజలకు మొదటివారలము !
కర్ణుడు మావాడంటూ గంతులు వేసే
దేశ నాయకులు
అన్నపూర్ణను
ఆరాధించే ముగుదలు

జాలకములపై
తడిపిన వట్టివేళ్ళ
తట్టీలు కట్టిన ఇండ్ల
ద్వార ముఖమ్ములు
బంధించారు
కన్నులు మూసి నిద్రించారు.

దేశం అంటూ, దేవుళ్ళంటూ
కొలిచే కళ్ళకు
బానిసత్వమే ప్రబలింది.
ఉసురుసురైంది
ఉమ్మలించింది
అసువులు వీడి
చచ్చిన దేశమాతయై
చాపచుట్టగ నేలకు వాలింది !

వీధి కాలువను
బురద నీటిలో
విశ్రమించిన శ్వానాథుడొక్కడు
నిశ్వసించినాడు.

ముందరి కాళ్ళకు బంధంతో
కాకితమ్ములే కసువని మేస్తూ
చంక్రమణం చేసే
చక్రీవంతపు చక్షులు
చిలుప చిలుపగా తొలకరించినవి.

తోడులేని నీడలేని
ఆడుదాని చూడజాలక
తరుశాఖల్లో తలక్రిందై
తపించి పోయి
ఋషిపక్షొకటి
నేలకు వాలింది.

భూపతి ఆజ్ఞకు భూమి పుట్టువు
చిచ్చున జొరబడ్డాది
శీలం కోసం ఆనాడు!

ఆకలి దీర్చని
మానం గప్పని
దేశం కోసం
మట్టి ప్రమిదలో
వత్తై కాళిందీ
మానిని ఈ నాడు!!

*

## కదనకుతూహల రాగం

రుధిర జ్యోతిర్
జ్వలనా లలనా ప్రియుండ!
విప్లవ ఋషిని
విద్రోహ కవిని
ఆహవరంగం నా హృదంతరంగం
పగిలిన ఖలేజాలె
నా పాటల జలేజాలు.

మర ఫిరంగినె మహతిగ మీటి
కదన కుతూహలరాగం విన్పిస్తాను
అగ్గిని కురిపిస్తాను.
బ్రహ్మాండ భాండమ్మున
శేషుని కోరల
గరళం పిండి
గాలి పెదవుల
కమ్మని
తమ్మల మట్టుల పూసేస్తాను
నీలితావుల
చావు పూవులే మొలిపిస్తాను.
నిర్మల నభంపు
నీల పాళికల
వెన్నెలి కత్తి ఝళిపిస్తాను
నోరులేని తారలచే
కీలాలం కక్కిస్తాను
శంకరు శ్యామల
శంఖగళమ్మె పూరిస్తాను
హాలాహలమె బొట్టుగ కీలిస్తాను

మహాశక్తినై
మారణ మంత్రం
పారణచేస్తూ
చివురించిన ఈ
జనాళి యుద్ధం
జైత్ర రథమ్ముగ
కజ్జల కాళి
గజ్జల గుఱ్ఱం
కాల భుజంగం
కళ్ళెంలాగి
'ఛలో! ఛలో!' యని
సాగిపోయెదను.

*

## కిటికీలో దీపం

జితేంద్రియుని బుద్ధిలాగు
జేగంట లాగు
కిటికీలో దీపం!

గోడివతల
గదిలోపల
పేరుకున్న కాంతి
గోడవతల
చీకటి!

హృదయంలో ఒకటి రెండు
వెలుతురు గాయాలు.

స్వర్గం నరకం
చావు బ్రతుకు
గొప్ప బీద

వ్యత్యాసం
తెలివితక్కువ
చదువెక్కువ
తారతమ్యం.

జీవహింస
చేయనని, చూడనని
నా శపథం!

గోడమీద
గదిలోపల
వెలుతురు కాసించి
చేరిన జీవుల
ఆకలితో
భక్షించె బల్లి!

పక్కలో పాలుత్రాగు
పసిపిల్లడు
ఉక్కిరి బిక్కిరి యైనట్టు
గొప్పగాలి రేగింది

గోడవతల
చీకటి నవ్వింది

కిటికీలో దీపం
కంపించి
ఊపెత్తిన వెర్రి పీరులా
ఊగి ఊగి
సాగి సాగి
తెగిపోయిన
రబ్బరు ముక్కై తెగటారెను!

ఇప్పుడో
కిటికీలో
గోడివతల
గోడవతల
గదిలోపల
ఒకటే చీకటి!
జీవ రహస్యం!!

**

# శ్రీశ్రీ

## జయభేరి

నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను!

నేను సైతం
విశ్వవృష్టికి
అశ్రువొక్కటి ధారపోశాను!

నేను సైతం
భువనఘోషకు
వెర్రిగొంతుక విచ్చి మ్రోశాను!

• •

ఎండకాలం మండినప్పుడు
గబ్బిలంవలె
క్రాగిపోలేదా?

వానకాలం ముసరిరాగా
నిలువు నిలువున
నీరు కాలేదా?
శీతకాలం కోతపెట్టగ
కొరడుగట్టీ,
ఆకలేసీ కేకలేశానే!

• •

నే నొకణ్ణే
నిల్చిపోతే-
చండ్రగాడ్పులు, వానమబ్బులు,
మంచుసోనలు
భూమిమీదా భుగ్నమౌతాయి!

నింగినుండీ తొంగిచూచే
రంగు రంగుల చుక్కలన్నీ
రాలి, నెత్తురు క్రక్కుకుంటూ
పేలిపోతాయి!

పగళ్ళన్నీ పగిలిపోయీ,
నిశీథాలూ, విశీర్ణిల్లీ,
మహాప్రళయం జగం నిండా
ప్రగల్భిస్తుంది!

• •

నే నొక్కణ్ణీ ధాత్రినిండా
నిండిపోయీ—
నా కుహూరుత శీకరాలే
లోకమంతా జల్లులాడే
ఆ ముహూర్తాలాగమిస్తాయి!

• •

నేను సైతం
ప్రపంచాబ్జపు
తెల్లరేకై పల్లవిస్తాను!

నేను సైతం
విశ్వవీణకు
తంత్రినై మూర్ఛనలు పోతాను!

నేను సైతం
భువన భవనపు
బావుటానై పైకిలేస్తాను!

*

## మహాప్రస్థానం

మరో ప్రపంచం,
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది!
పదండి ముందుకు,
పదండి త్రోసుకు!
పోదాం పోదాం పైపైకి!

కదం త్రొక్కుతూ, పదం పాడుతూ,
హృదంత రాళం గర్జిస్తూ -
పదండి పోదాం,
వినబడ లేదా
మరో ప్రపంచపు జలపాతం?

దారి పొడుగునా గుండె నెత్తురులు
తర్పణ చేస్తూ పదండి ముందుకు!
బాటలు నడిచీ,
పేటలు కడచీ,
కోటలన్నిటిని దాటండి!
నదీనదాలూ,
అడవులు, కొండలు,
ఎడారులా మన కడ్డంకి?

పదండి ముందుకు!
పదండి త్రోసుకు!
పోదాం, పోదాం పైపైకి!

ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా! చావండి!
నెత్తురు మండే
శక్తులు నిండే
సైనికులారా! రారండి!
"హరోం! హరోం హర!
హర! హర! హర! హర!
హరోం హరా!" అని కదలండి!
మరో ప్రపంచం
మహా ప్రపంచం
ధరిత్రి నిండా నిండింది!

పదండి ముందుకు!
పదండి త్రోసుకు!
ప్రభంజనం వలె హోరెత్తండీ!
భావవేగమున ప్రసరించండీ!
వర్షుకాభ్రముల ప్రళయ ఘోషవలె
పెళ పెళ పెళ పెళ విరుచుకు పడండి!
పదండి,
పదండి,
పదండి ముందుకు!
కనబడలేదా మరో ప్రపంచపు
కణకణ మండే త్రేతాగ్ని!

ఎగిరి, ఎగిరి, ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు!
తిరిగి, తిరిగి, తిరిగి సముద్రాల్
జల ప్రళయ నాట్యం చేస్తున్నవి!
సల సల క్రాగే చమురా? కాదిది,
ఉష్ణ రక్త కాసారం!

శివ సముద్రమూ
నయాగరా వలె
ఉరకండీ! ఉరకండీ ముందుకు!
పదండి ముందుకు!
పదండి త్రోసుకు!
మరో ప్రపంచపు కంచునగారా
విరామ మెరుగక మ్రోగింది!
త్రాచులవలెనూ,
రేచులవలెనూ,
ధనంజయునిలా సాగండి!

కనబడలేదా మరో ప్రపంచపు
అగ్నికిరీటపు ధగధగలు
ఎర్రబావుటా నిగనిగలు,
హోమజ్వాలల భుగభుగలు ?

*

## వ్యత్యాసం

అదృష్టవంతులు మీరు.
వెలుగును ప్రేమిస్తారు,
ఇరులను ద్వేషిస్తారు.
మంచికీ చెడుకీ నడుమ
కంచుగోడలున్నాయి మీకు.

మంచి గదిలోనే
సంచరిస్తాయి మీ ఊహలు,
ఇదివరకే ఏర్పడిం దాగది.
అందుకే వడ్డించిన విస్తరి మీ జీవితం.
నిశ్చల నిశ్చితాలు మీవి.

మంచిని గురించి,
మర్యాద, మప్పితం గురించి,
నడతా, నాణ్యం, విలువల విషయం
నిశ్చల నిశ్చితాలు మీవి.

మీ కన్నుల చూపులు సరళ రేఖలో !
రేఖ చెదిరితే గొల్లుమని పోతారు.
రేఖ కవతలి వారంతా నేరగాళ్ళు.
రేఖను రక్షించడానికే
న్యాయస్థానాలు, రక్షకభట వర్గాలు,
చెరసాలలు, ఉరికొయ్యలు.
రేఖను కాపాడకతీరదు.

• •

అభాగ్యులం మేము.
సరిహద్దులు దొరకని
సంధ్యలలో మా సంచారం
అన్నీ సమస్యలే, సందేహాలే మాకు.
వెలుగులేని చీకట్లే.
ఇరులలోని మిణుగురులే చుస్తాం
నూరుదోషాలలోని ఒక సుగుణం
నూరు పుణ్యాలలోని ఒక ఘోరం ;
వ్యత్యాసాలూ, వ్యాఘాతాలే
అడుగడునా మాకు.

మా వంట మేమే వండుకోవాలి,
ఒక్కొక్క మారు విస్తరే దొరకదు.
జీవితపు సన్నని సందులకే
ఆకర్షణ మాకు.

మా దృష్టిది వర్తుల మార్గం.
ఆద్యంత రహితం.

సంధ్యా జీవులం, సందేహ భావులం.
ప్రశ్నలే, ప్రశ్నలే
జవాబులు సంతృప్తి పరచవు.

మాకు గోడలు లేవు.
గోడలను పగుల గొట్టడమే మా పని.

అలజడి మా జీవితం
ఆందోళన మా ఊపిరి.
తిరుగుబాటు మా వేదాంతం.

ముళ్ళూ రాళ్ళూ అవాంతరాలెన్ని ఉన్నా
ముందుదారి మాది.

ఉన్నచోటు చాలును మీకు.
ఇంకా వెనక్కి పోతామంటారు కూడా
మీలో కొందరు.

ముందుకు పోతాం మేము
ప్రపంచం మావెంట వస్తుంది.

తృప్తిగా చచ్చిపోతారు మీరు.
ప్రపంచం మిమ్మల్ని మరిచి పోతుంది.

అభిప్రాయాల కోసం
బాధలు లక్ష్యపెట్టని వాళ్ళు
మాలోకి వస్తారు.

అభిప్రాయాలు మార్చుకొని
సుఖాలు కామించే వాళ్ళు
మీలోకి పోతారు.

*

## ఆశా దూతలు

స్వర్గాలు కరిగించి
స్వప్నాలు పగిలించి,
రగిలించి రక్తాలు, రాజ్యాలు కదిపి—
ఒకడు తూరుపు దిక్కునకు!

పాపాలు పండించి,
భావాలు మండించి,
కొలిమి నిప్పులు రువ్వి, విలయములయినవ్వి-
ఒకడు దక్షిణ దిక్కు!

ప్రాకారములు దాటి,
ఆకాశములు తాకి,
లోకాలు ఘూకాల బాకాలతో నించి
ఒక డుదీచికి!

సిందూర భస్మాలు
మందార హారాలు,
సాంద్రచందన చర్చ సవరించి ఒకడు
పడమటికి!

మానవకోటి సామ్రాజ్య దూతలు, కళా
యజ్ఞాశ్వముల్ గాలులై, తరగలై,
తావులై
పుష్పాళ్ళు, కుంకుమల్, పొగలై సాగిరి!



# శిష్ట్లా ఉమామహేశ్వరరావు

## వైతరణి

౧

అనాథ బాలికల జీవాలు
అనాఘ్రాత కుసుమాలు రాలినరీతిగా నిరాధారాలెట్లో,
నిష్ప్రయోజక ప్రతిభావంతుల జీవితాలు అట్లే
నిష్ఠూరాలుగా నా దేశ జనులలో నిలిచిపోయినవి!
నా దేశ జనులలో నిలిచిన నిష్ఠూరాలే,
నా జీవితాంతం వరకూ తరుముతున్న దయ్యాలు!
దీర్ఘాయు దీలుతో దీన వదనాలతో దూపిల్లు దయ్యాలు!
దోగాడు దయ్యాల దీనాలాపాలు
పూదోట విహరించు
క్రూరసర్పాల బుసబుసల కుసుమ సువాసనలవలే
భయాన్ని భ్రాంతినీ పురిగొల్పుతున్నవి!
నిశీథ సౌందర్యమూర్తీ!
మైమరచి నీ యధర చుంబనానందితుడనైనా
నిష్ఠూర సర్పాల నిశ్శ్వాస కుసుమవాసనలు
నన్నారాటపెట్టి కారాడి కారాడి
నా జీవాల రాపాడుచున్నవిగదే!

౨

ఓహో సౌందర్య సామ్రాజ్య నిశీథమూర్తీ!
తరాలనుంచి వ్యాపించివచ్చు విచార వ్యాధిగ్రస్తుడౌ
సామ్రాజ్యాధిపుని బోలుదును నేను;
తరాల విచారము నా హృదయాన ప్రవేశించి వ్యాపించి
సమాధి చేసె నా పుష్పాల శయ్యను!
నిర్జీవ కార్యాలుగానుండు మృతజీవి నౌ నే జేయునవి!
ఏమందువా ఓ నిశీథ సౌందర్యమూర్తీ!
నా రక్తనాళములో పసరెక్కి పేరుకొన్నది విపరీత వైతరణి!

## యుగశక్తికి ఆహ్వానము

ఓహో ! సౌందర్య నిశీధ సామ్రాజ్యమూర్తీ !
రక్తారుణప్రవాహ సమరకల్లోలములో ప్రజల
ప్రఫుల్ల సౌందర్య జీవితానందముగ్ధులం జేయుదువు !
అనంత ముఖములు గల అందాల అనలమా !
నీ సయ్యాట పాటల యారాటములతో కుందకిట
కుండలంబుల కాంతి బ్రహ్మాండమునకు తేజశ్శక్తియౌను !
జీరాడు వోణీల నొయ్యారముగ నెత్తి వింజామరల్
వీవగా నీవు, ఆశక్తి సర్వవ్యాపకము జెందును.
కల్లోల మేఘాగ్నివై నడియెండలో మెరుపుతీగలపై
వసంతము లాడు వివస్త్రమూర్తీ ! నీ శరీరముపైన
బంగారు నూగారు విద్యున్మాలయై వర్థిల్లుచున్నది !
అనలముల దళములతో వెలుగొందు నాభిలపద్మమై
నీ ముఖము నిత్యయౌవనమై ప్రణయాగ్ని పవనమై
నా హృదయ అంబుధీ దావాగ్ని ధవళమౌతున్నది !
ఓహో తేజమా ఓజమా ఆఖిలబీజమా ! స్ఫూర్జితాక్రాంతమా !
నీ జ్వాలలో సకలవర్ణములునూ నిలయమై యుండును.
పలకలతో వికసించు వజ్రముల ధవళతలు, అలలుపై జిమ్మ
సమ్మోదభరితలై విరుచుకుని వెదజల్లు అంబుధులమాణిక్య
హారాల వర్ణములు, అనంత చైత్రముల నిబిడమౌ
కెంజాయ చిగురాకు పూతలో రకరకపు రీతులు,
ఉయ్యాలలూగు నీలధవళిమల మిళితమగు మంచుబిందువుల
జిలుగైన రంగులు, నీ ప్రేమజ్వాలలో నిబిడమై నీరుకావులదేలు !
ఓహో సౌందర్య సామ్రాజ్యమూర్తీ ! విరాడ్విశ్వేశ్వరార్థాంగపత్నీ ! నక్షత్ర
స్ఫటికముల నవనవలాడే వెలుగువై, తళుకువై, నిబిడాంధ
కారాంధ్ర దేశాకాశాన, వజ్రాయుధమువలె
ఏనాడు గన్పడెదవో దెల్పుము : త్రిపురాంతకుడనై
లేచెదను, ప్రళయకాలాభీల గర్జపర్జన్యములతో,
నిశీధ నిబిడాంధ కారాంతరాళాగ్ని నగు నేను... ... !
ఉదయోదయాల నడుమ, ప్రాక్పశ్చిమ ప్రాకారముల మధ్య,
జీవితానంతరపు నిశ్శబ్దరూపముగ, మొలకెత్తు మున్నె
చీకటిలో నిరీక్షించు చుండేటి విత్తనపు రూపుగా
నీ యాలయము నిర్మింపబడినది, ఉత్పత్తిలయములలో

జీవితపు హాహాకారాలు, సంతోషధ్వానాలు, నీయందు
నీవుచ్చరించే హ్రాం, హ్రీం, హ్రూం! హ్రాః! అనే యుచ్చైస్స్వరాలు!
ఆద్యంతములు మిళితమై నగయు నిశ్శబ్ద కాలచక్రం
బంగారు వడ్డాణరూపమై నీ నాభికలంకారం.
నీ నర్తనల నాలించి జీవితము వికసించు- మృత్యువే ధ్యానించు
ఆకుపై ఆకుతో వేరుపై వేరుతో పూవుపై పూవుతో
సంధిసంధులమధ్య వాసిల్లు రహస్యాల గర్భాననే దాచి
ఏ మృత్యువునుండి జనించి ఏ మృత్యువుకై తాను
పెరుగునో యా జీవితానందపు కళలను వెన్నాడుచూ,
అంధకారాంతరాలనుండి, వర్ణాల విత్తనాల్వికసించు.

*

## ప్రేమ

ప్రేమయనగా చూచుటగాదు, పలుకుట గాదు,
విహ్వలచిత్తముతో వాపోవుట గాదు!
ప్రేమయనగా మంత్రము గాదు, తంత్రముగాదు,
ఆత్మనిర్వాణముచే ఆరాధించుటయే!

అనగనంగా ప్రేమయనంగ అపూర్వగాథ!
పూర్వకర్మ పరిపక్వ మహాగూఢ గాథ!
సీతయనగా చెంచీతయనగ
త్రేతాయుగపు పరాశక్తి! ద్వాపరలక్ష్మి!
కలిలో నా లక్ష్మి!

జన్మతో జన్మించునోయీ జీవేచ్ఛలన్నీ
జన్మాంతము జీవించునోయి!

జనకుని గృహమున నున్న సీత, నా
కలలో, వెన్నెల జల్తారు భూమిపై నడువగా కాలి
గొలుసుల విలాస రాసకళ లీలలు
నన్ను నిలువున చెంగటుయ్యాలల
నూచి మేల్కొల్పు!
ధరణిని వహించి మందగమనయౌ
జగశ్శక్తి, శ్రీశక్తి! సీతను చూచి సహించలేను!
ఎంత భారమో కనుమూయక మోయి,
క్షేత్రవతి, సీత స్వేదనము వైకుంఠము దహించు!

చెమటబిందువుల చెదిరించి రాల్చు
పయ్యట పీవగారాలు ముత్యాల తలంబ్రాలెన్నడో !
ఎన్నడో పడతి కీనీడ వెనుక
వెనుకగా, వెనుకగా, వెనుకగా వెన్నాడి కవ్వించి నవ్వించి
సీతా ! మైథిలీ ! వైదేహీ యని
పేర్లతో కూర్చి కౌగిటజేర్చి వైకుంఠమును భూమికి దెచ్చుటెపుడో !
చెమటలన్ చిమ్ముచు ముత్యాలబిందు
వుల ఒడలు, భారమున కృంగిన
ఒడలు, నడువగా, నా
గుండె దడదడ యని జగద్భారమును
ధరించు ధరణిజయే తొట్రుపడిన జగతి యేమౌనంచు
మూడుకోట్ల కండ్లు గలవాడనై, ముజ్జగముల వీక్షించుచూ
ఆత్రుతార్తి హృదయుడనై
క్రుంగుచుంటి !
... ... ...
సర్వమానవ సమిష్టి బాధ్యతను
వెలలేని వెన్నెముకపై
మోయుచున్నది సీత ! — అడుగు
పడినపు డామేర ఆ మేర
కూకటివేళ్ళతో పాతాళము కదిలినటుల
క్రుంగగా, క్రుంగగా, నా హృదయము
కూలుతూ కుప్పగ దొంత్ర దొంతరులగ కూలిపోయె !

*

## బీదమందు

తూర్పు తెల్లారింది ! వాన వెలిసింది ! అమ్మ
పోయే మందెట్టుకు రాయే !
కాండబ్బైనా లేదు, కాసైనా లేదు ! కాత్తె
కూత్తెకై తే డాక్టేరు రాడే !
సందేళ సలిజరం ఊరెక్కపోదే ! సందొచ్చిన
పిల్లోడు ఉలుకుతుండాడే !
ఏయాకో తింటుంది గజ్జెట్టిన కుక్క ! నేపాళం
మాత్రెయ్యే, లేత్తాడు పిల్లోడు !
పాతాళం బలిసెక్రవర్తీ ! సంకురాంతి పం
డక్కు నేపాళం సెట్టెక్కిరా ? జబ్బులన్నీ పోతాయి !

**

# సోమసుందర్

## ఖరార్‌నామా

జన్మమెత్తిన మానవునకు
జీవితమె పరమధనం;

అయితే అది ఒకమారే
అతని కొసగబడిన వరం.

పుట్టలోని పురుగులవలె,
పుట్టి పెరిగి,
సంఘంలో తావులేక,
అస్తిత్వ ప్రయోజనం
ఊహకు అందనిదవగా,
తన చరిత్ర చెరిపేసుక,
తన దారిన వెళ్ళిపోయే
మానవుడిక పుట్టబోడు;
సుడిగుండంలో పడి తిరగడు.

• •

ఎపుడో అజాతయుగంలో
నీపై కప్పబడిన దుప్పట్లే,
దుష్ఫలితాలై, దుర్భరమైనా,
తొలగించే శక్తిలేక
మరణబాధతో గిల గిల
తన్నుకునేందుకు
జన్మించావా ? మనిషీ ?

పిరికితనపు సిగ్గులకగ్గలమై
దగ్ధపటలమై, పొగచూరిన
భూతకాల మర్యాదలు -
ప్రేలాడే బూజులు-
వేటాడే భూతాలై నిను తరుముతుంటె
పిరికిమందు తింటావా ?
నరుడా ! !
వీరునివలె తిరుగుబాటు చేస్తావా ?

ఉన్నదొక్క జీవితమే;
మానవునిగ, వీరునిగా
బ్రతుకుము నరుడా !
చరిత్ర నీ కోసం
ప్రసవబాధ పడుతున్నది !
భవిష్యత్తు నీ కోసం
పడిగాపులు పడుతున్నది !

అర్పించెయ్ నీ రక్తం మనిషీ !
నీ త్యాగం వృధా కాదు !
నీ త్యాగం వృధా కాదు !

ప్రయోజనం లేని
బరువుటేళ్ళు మోసి మోసి
బడుగై పోయిన
దరిద్రమున కనలు బ్రతుకు !
గొలుసులోన కుక్క బ్రతుకు-
చాలు చాలు నరుడా ! బ్రతుకలేవు.

ఉన్నది ఒక బ్రతుకే;
గతమును ఒక్కసారి విస్మరించు;
శూరుడవై శృంఖలముల ఛేదించు.

ప్రసవించే శాంతి జగతి

సువర్ణ దీధితి నీకే,
సుమ్మాటికి నీ తమ్ములకే-
మనిషి ! -నీరాజనమిస్తుంది.

పుట్టే నీ బిడ్డడు
దరిద్రమున, దోపిడిలో
బ్రతుకడు; బ్రతుకలేడు.
ఏవో ఆశల నిచ్చెనలను నిర్మించుక,
నిట్టూర్పుల వంతెన కట్టుక
స్వప్నాలోకనలో స్వర్గలోక
సౌఖ్యాలను తలపోస్తూ,
పుట్టే పాపాయిక
బ్రతుక లేడు, బ్రతుకడు.

• •

స్వేచ్ఛకొరకు జరిగే
విప్లవ సమరంలో
క్షతగాత్రుడవై పడిపోయిన మనిషీ !
గాయపడిన సింహం వలె
గర్జించిన నీ కంఠధ్వని
రాబోయే స్వర్ణయుగానికి జయభేరీ !
నీ జీవిత మొక రహదారీ !

నవసమాజ వ్యవస్థకే
బీజాక్షర నామకరణ మహోత్సవం !
నీ గొంతు కొసలు
దేశభక్తి నిర్వచనాలై
అహరహముగ నిలుస్తాయి;
జీవిత బలిదానం చేసిన మనిషీ !
నీ వచనాలే లోకపు
అంతిమ ఘడియల వరకూ
ప్రతిధ్వనిస్తాయి !

రక్తము అర్పించుము నరుడా !
నీ త్యాగం వృథాకాదు;
నీ త్యాగం వృథాకాదు.

*

## మౌనఘోష

ఆకలి వేస్తోందమ్మా! అన్నం పెట్టమ్మా!!
స్వర్ణారుణా సస్యశ్యామలమగు
ఈ జగతిని, దరిద్రమున

ఆకలితో, చావలేను !

ఆశాసుమ మాలా
సౌరభ మిది వీడలేను !
ఆకలి ! అమ్మా ! ఆకలి !!

అన్నపూర్ణ గర్భగుడిని
ఆకలి గంటలు మ్రోగెను;

ఆరని ఆకలి కీలలు
భైరవ నాట్యము చేసెను;
ఘోర పరాజయమా ఇది ?
మానవ మారణ హోమం !
తల్లీ ! ఆకలి...! ఆకలి...!!

ఆకలి నాగుల నాలుక
అగ్నిజ్వాలల నెగజిమ్ముతోంది !
అమ్మా... ! ఆకలి !! ఆకలి !!!

నా కడుపొక బడబానలమై
మండుతోంది తల్లీ... !
లోకం నరహంతక కంటకముల
కావృతమై ఘూంర్ణిస్తోంది !
లోకం పరాన్న భుక్కుల చేతులలో
పరాధీనయై విలపిస్తోంది !
తల్లీ ! ఆకలి...! ఆకలి...!!

నాలో చెలరేగిన
ఆకలి కంతిమ ఆశ్వాసం ఎచటో ?
తుది మజిలీ ఎపుడో ?
మృత్యువు మృత్తికలో
దాగుంటోందనుగో...!

పేదల నిర్భాగ్యుల రక్తంతో
స్మశానాలు శాసనాల వ్రాస్తున్నాయవిగో...

అమ్మా! ఆకలి...! ఆకలి...

నాలో, నరాలలో, లోపలి
గడియారం తలుపుకు
ఘడియ పడిందెపుడో...!
ఆ కలి, నన్నీలోకం నుంచెడ బాపులు
చేసేందుకు చూస్తున్నది!
అమ్మా... చావలేను! చావలేను!

నరులందరికీ
సరిపోయే సిరిసంపదలతో
తులతూగే ఈ దేశం నాదమ్మా!
తల్లీ! విడువలేను
నా, యీ, అందమైన లోకం!

అమ్మా! ఆకలి... ఆకలి... *

## భగత్సింగు

ఒక తారక మేల్కాంచెను;
ఒక వీరుడు కనువిచ్చెను.
ఒక మెళుకువ!
ఒక్క వెలుగు!!

♦ ♦

ఒక తారను పీకనులిమి
చంపిందేదో చీకటి!
ఆ వీరుని పీక నులిమి
చంపిందేదో పిశాచి!!

♦ ♦

కోటికోట్ల తారకలు!
బారులు తీరిన తారలు...!!
మహాకాంతి!
మహాకాంతి!!

చీకటి కడుపున చిల్లులు;
చీకటి గుండెకు తూటులు.
నవజగతీ యువ వీరులు;
భవిష్యత్తు కధినేతలు.
మహాక్రాంతి!
మహాక్రాంతి!!

చీకటి పిశాచి చచ్చెను;
తాటకి వలె, పూతన వలె,
మేరువుగా శవం పడెను.

♦ ♦

తొలి తారక తేజం
యువ వీరుని తేజం.
క్రాంతి కాల జాగృతియై
లోకం ముంచెత్తివైచె.

♦ ♦

అంచాతనె ఆకాశం
అరుణోదయమై వెలిగెను.
అంచాతనె భూలోకం
తిరుగుబాటు-ఎరుపెక్కెను!!

♦ ♦

అరుణపతాక చ్ఛాయల
ఆయుధాల ప్రవాహమై
అక్షయ తూణీరం వలె...
అక్షీణ పరాక్రమం వలె...
బారులు తీరిన వీరులు!
భారత విప్లవయోధులు!!

♦ ♦

ఒక వీరుడు...
ఒక తారక...
ఒకటే ఒక కాంతిరేఖ!
లోకం తొణికిసలాడిన
మహా కాంతి!
మహా క్రాంతి!

*

## సుధాసారం

వాన కురుస్తోంది
మానవుని మానసి కాంతర్ని బిడ
దురాలోచనల పైన
వాని అంతరంగ కల్లోలినీ
దురాశా తరంగాల పైన
సాంద్రతమస్సూకర ఘీంకారాల పైన
కుట్రల పైన, కుహకాల పైన
కౌటిల్య పన్నాగాల పైన
పాపజాతి నాగుల పన్నాగాల పైన...

వానకురుస్తోంది
యుద్ధోన్మాదులు పురెక్కించి -
ముట్టించిన జానకి త్రాళ్ళపైన
గిరులను పగిలించే ద్వేషానలం పైన
శాంతికి తలగోరు పెట్టె-చింతాన్విత
చితాగ్నుల పైన
కల్మషాల పైన, కాలుష్యాల పైన
కిల్బిషాల పైన... స్థాలిత్యాల పైన...
వాన కురుస్తోంది
మానవ హృదగ్నిపర్వత జ్వాలల పైన
భువనమోహన బృందావనిలో
విషపుకాటు తగిలి, పట్టుతప్పి
రాలిపడిన ఆశాఫలాల పైన...
జాలిపడిన ఆక్రోశ జలాల పైన...
రక్కసి కిండ్ల పైన...పిచ్చితలల ముండ్ల పైన.

వానకురుస్తోంది
అవనీతల కమనీయతల పైన...
అసముత్కర్ష విజయోత్సవ హర్షశ్రీల పైన...
శాంతిరూప దయావతీ
మేదినీ సమాశ్లిష్టం పైన...
నవమానవ విజిగీషా పులకితహృత్సీమ పైన
ప్రియబాంధవ నరనారీ
వికచ జీవనోత్సవాల పైన...
వానకురుస్తోంది జ్ఞానతుషారమై
స్నేహమధుర సుస్మితమై
నీరద కేదారాల వాత్సల్య పరీరంభమై...
జనలూహృత్కమలాకర వికాసోత్సమై...
సముత్కర్షమై... సుధావర్షమై...
హర్షారంభయై. **



తెలుగు ఎదలో తెలుగుతనం

వెల్లువలా పారాలని

తెలుగింటిలో తెలుగుదీపం

అఖండంగా వెలగాలని

ఈజాతి నిదురలేచి

మహెూన్నత మానవాదర్శాల వైపు

నిరంతర కృషితో

పయనం కొనసాగించాలనే ధ్యేయంతో

ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది.

భాషాభిమానం కలగాలంటే

మాతృభాషా సాహిత్య పఠనమే

ప్రథమ కర్తవ్యం అనే భావం

బలంగా మనసులో నాటుకోవటానికి గాను

వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు

ఉత్తమసాహిత్యం అందించేందుకు

యువభారతి పూనుకున్నది.

ప్రతి తెలుగింటిలో

కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు

మనందరం ఉద్యమ వేగంతో కృషి చేద్దాం.

ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా

యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా

ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం.

**యువభారతి**

సాహితీసాంస్కృతికసంస్థ
5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-3